# భారతీయ చిత్రకళ



తలిశెట్టి రామారావు, బి. ఏ., బి. యల్.

ఆంధ్ర గ్రంథమాల — నెం. ౧3.

# భారతీయ చిత్రకళ

గ్రంథకర్త:

తలిశెట్టి రామారావు, బి. ఏ., బి. యల్.,

ప్రకాశకులు:

కాశీనాథుని నాగేశ్వరరావు

౧౯3౦ సంవత్సరము] [వెల రూ. ౧-౦-౦.

# విషయానుక్రమణిక

---

# పరిచయవాక్యములు

ఆంధ్ర గ్రంథమాలయందు శ్రీ తలిశెట్టి రామారావుగారు రచియించిన భారతీయచిత్రకళ పదవ కుసుమము. ఈగ్రంథ మాంధ్రమునందు చిత్రకళావిషయమునకు సంబంధించిన మొదటి గ్రంథము. చిత్రకళాభినివేశము లేని పరిచయవాక్యములును ప్రయోజనకరములు గావు. విశ్వప్రవృత్తియందు రసానందమునకు భావరూపములు సాధనములుగ నున్నవి. భావరూపములవినాభావసంబంధమును గలిగి అనిత్యములైన రూపముల ద్వారా నిత్యమైన ఆత్మానందమును గలుగజేయుచున్నవి. మానవవిజ్ఞానాంకురములు రూపలేఖనములతో నారంభమై కాలక్రమమునను మహావికాసమును బొందినవి. ఆదియుగవాసులు రచియించిన చిత్రములు ప్రాచీనగుహలయందు గనుపట్టుచున్నవి. ప్రపంచమునందు భిన్నదేశములందు చిత్రకళ వారిసంస్కారాశయముల కనురూపముగ వికసించుచు మానవధర్మాభ్యుదయమునకు సాధనం బగుచున్నది.

పాశ్చాత్యశిల్పమునకు రూపమును, ప్రాచ్యశిల్పమునకు భావమును మూలాధారము లై వికసించినవిధమును శిల్ప పరిశోధనలు విశదముచేయుచున్నవి. యవన రోమక శిల్పమునకు రూపసౌందర్యమును, రూపవ్యామోహమును హృదయముగను బరిణమించినది. యవన రోమక శిల్ప ప్రభవమైన పాశ్చాత్యశిల్పమునకును భౌతికవిభూతులు హృదయముగను బరిణమించినవి. భారతీయ శిల్పమునకును, విజ్ఞానమునకును భావగాంభీర్యము హృదయముగను బరిణమించినది. విశ్వప్రవృత్తియందు పాశ్చాత్య శిల్ప మాధిభౌతికకల్పనలను, ప్రాచ్యశిల్ప మాధ్యాత్మిక కల్పనలను ప్రత్యక్షము చేయుచు రూప భావ రసానందమును గలుగజేయుచున్నవి. సకలేంద్రియములయందును ప్రధాన మైన నయనేంద్రియము రూప భావానందములను గలుగజేయుచున్నది. భారతీయశిల్పము భారతీయ విజ్ఞానమువలె స్వతంత్రవ్యక్తిత్వమును గలిగియున్నవిధమును శిల్పహృదయము విశదముచేయుచున్నది.

విశ్వావృతమైన ఆత్మస్వరూపమునే కావ్యములు వర్ణించుచు చిత్తమునకు బ్రహ్మానందమును గలుగజేయుచున్నవి; చిత్రములు నేత్రములకు ఆనందము గలుగజేయుచున్నవి; గానములు వీనులకు విందుగొల్పుచున్నవి. సామాన్యముగ కావ్యములు, రూపలేఖనములును, గీతములు,

భౌతికమైన రూపప్రదర్శనమునకు వినియోగపడినపుడు రూపాతీతమైన ఆనందము గలుగజాలదు. సాహిత్య కళా విషయములందు ప్రాచ్యపండితులకును, పాశ్చాత్యపండితులకును రూపభావాశ్రయమునందు భేదము గోచర మగుచున్నది. పాశ్చాత్యులకు రూపమునందును, ప్రాచ్యులకు భావమునందును అభినివేశము గోచరమగుచున్నది. ప్రవృత్తియందు భావాశ్రయము లేనిరూపముగాని, రూపాశ్రయము లేనిభావముగాని యసంభవములు. సాహిత్యకళలు రూపాశ్రయమును వ్యక్తముచేయునపుడు భౌతికవైభవమును, భావాశ్రయమును వ్యక్తముచేయునపు డాత్మవైభవమును ప్రదర్శించుచున్నవి. ఆత్మాశ్రయము లేనిపాశ్చాత్యశిల్పులకు భారతీయచిత్రకళ విచిత్రముగ దోచుట సహజము. పాశ్చాత్యశిల్పము రూపాశ్రయము ప్రముఖమైన గ్రీకుశిల్పము ననుకరించినవిధమును పాశ్చాత్యశిల్పము వెల్లడించుచున్నది. పాశ్చాత్యవైఖరి లేని భారతీయచిత్రలేఖనము పాశ్చాత్యశిల్పజ్ఞుల పరిహాసమునకు పాత్రమైనది. లోపము విమర్శకులదె కాని చిత్రకళది కాదు. రూపలేఖన మపరిమితమైన భావప్రదర్శనమును జేయుట దుష్కరము గాని పరిమితమైన రూపప్రదర్శనము జేయుట దుష్కరముగాదు. ఈపరమార్థమును గ్రహించిన పాశ్చాత్యపండితులు ప్రాచ్య చిత్రలేఖనమందలి

ఔన్నత్యమును కొనియాడుచున్నారు. నూతేండ్లక్రింద టను భారతచిత్రకళను నిరసించిన పాశ్చాత్యకళాకోవిదులు వర్తమానకాలమందు భారతీయ చిత్రకళను ప్రశంసించుచున్నారు.

ప్రజల స్వాతంత్ర్యస్థితి సాహిత్యకళా వికాసమునకును, పారతంత్ర్యస్థితి సాహిత్యకళాక్షీణతకును, సాధనమగుచున్న విధమును సాహిత్యకళాచరిత్రము విశదము చేయుచున్నది. బ్రిటిషు పరిపాలనము భారతీయవిజ్ఞానమును స్తంభింపజేసినవిధముననే భారతీయ శిల్పమును స్తంభింపజేసినది. భారతీయసాహిత్యశిల్పములకు రాజప్రజాదరములు లేకపోవుటయే కాక అనాదరణముకూడ నేర్పడి సాహిత్యశిల్పములు జీవకళావిరహితము లైనవి. భారత జాతీయప్రబోధము సాహిత్యకళోద్ధరణమునకును, ఆత్మవిశ్వాసమునకును సాధన మైనది. పాశ్చాత్యపండితులు భారతీయచిత్రములందు రూపాతీత మైన భావార్థమును గమనించి దానియౌన్నత్యమును ప్రశంసించుట కుపక్రమించిరి.

మానవ సౌభాగ్యమునకు సాధనము లైన ప్రకృతి విభూతులను దైవాధిష్ఠితములుగ భారతీయశిల్పము పరికల్పించుచున్నది. కైలాసశిఖరము శివునకు నివాసము. క్షీరసాగరము నారాయణునకు శయనస్థానము. గంగా

నది భీష్మునకు జనని. ప్రవృత్తియందలి సుందరగంభీర స్వరూపములు దైవాధిష్ఠితములుగ పరిగణింపబడినవిధమును భారతీయ పురాణేతిహాసములు విశదము చేయుచున్నవి. దేవతార్చనతో నారంభ మైన భారతీయశిల్పము బౌద్ధ విహారములతో పూర్ణవికాసమును బొందినవిధమును బౌద్ధగాథలు, విహారములు విశదముచేయుచున్నవి. అమరావతీ, సంచి స్తూపములు, అజంతాచిత్రములు భారతీయ శిల్పమునందు ఆధ్యాత్మికహృదయమును విశదముచేయుచున్నవి. రూపప్రదర్శనమునందును, లావణ్యమునందును, భావగాంభీర్యమునందును, అంగవిన్యాసమునందును అజంతాచిత్రములు చిత్రలేఖనమందు నిరుపమానములై కళాకోవిదుల ప్రశంసలకు పాత్రము లగుచున్నవి. అజంతాచిత్రముల ప్రాశస్త్యమునకు మూలకారణము రేఖావిన్యాసము. సామాన్యముగ చిత్రకారులు రంగులపొందికతో వ్యక్తముచేసెడి రూపకల్పనను అజంతాచిత్రములు రేఖలతోనే వ్యక్తముచేయుచున్నవి. అజంతాచిత్రములందు అంగసౌష్ఠవము, అంగవిన్యాసము, అంగాలంకారములు, కాంతిచ్ఛాయలు, రేఖామాత్రకల్పితము లై అపూర్వ మైన శృంగార లావణ్య విలాసములను రూపలేఖనమునందు ప్రదర్శించుచున్నవి. భారతీయచిత్రకళకు జీవాధారము లైన దైవవిభూతులు, రేఖావిన్యాసము

అజంతాచిత్రములందు సర్వత్ర ప్రత్యక్షమగును పాశ్చాత్య ప్రాచ్య చిత్రకళలందు గల భేదమును వ్యక్తము చేయుచున్నవి. ధ్యానబుద్ధ స్వరూపమునందు ప్రకృతిపరవశులైన పాశ్చాత్యశిల్పులకు జడస్వరూపము మాత్రమే గోచరంబైనను ప్రాచ్యశిల్పులకు రూపాతీతమైన శాంత, సుందర, శివస్వభావములు గోచర మగుచున్నవి. భారతీయుల ప్రత్యభిజ్ఞానము భారతీయ చిత్రలేఖనమునకును ప్రత్యభిజ్ఞానమును గలుగజేసినది. పాశ్చాత్యకళాకోవిదుల యవజ్ఞతను నిర్లక్ష్యము చేయుచు ప్రాచీన సంప్రదాయముల కనురూపముగ భారతీయచిత్రకళ నుద్ధరించుట భారతీయప్రబోధనమునకు నిదర్శనముగ నున్నది.

భరతవర్షమునందు బౌద్ధమతము క్షీణించిన తరువాత చిత్రలేఖనమును క్షీణించినది. చిత్రకళయందు రేఖావిన్యాసమునకు బదులు వర్ణవిన్యాసము ప్రముఖత నొందినది. చిత్రకళయందు రాజపుత్రకళాశైలి, మొగలాయి కళాశైలి ప్రబలి ప్రాచీనశైలిని క్షీణింపజేసినవి. పాశ్చాత్యసంపర్కము ప్రాచ్యరచనల కనాదరణమును, పాశ్చాత్యరచనల కాదరణమును గలుగజేసినది. పాశ్చాత్యయంత్రాలయములందు ముద్రితములైన చిత్రపటములు భారతగృహముల నలంకరించి లలితకళాప్రయోజనమును సంకుచితము చేసినవి. భారత జాతీయ ప్రబోధముతో

చిత్రకళయందును నవయుగనిర్మాణము ప్రారంభ మైనది. నవయుగ చిత్రనిర్మాణమునందు వంగరచనలు, ఆంధ్ర రచనలు వ్యక్తిత్వము గలిగి ప్రాచీన సంప్రదాయముల కును, నవీనసంప్రదాయములకును సంయోగసాహచర్య ములను గల్పించుచున్నవిధమును చిత్రలేఖనములు విశ దము చేయుచున్నవి. వంగదేశమునందు అవనీంద్రనాథ ఠాకూరు, నందలాలు బోసు, అసితకుమార హాల్దారు, ప్రమోదకుమార ఛటోపాధ్యాయుడు మైసూరునందు వెంకటప్ప, పంజాబునందు అబ్దుల్ రహమాను చుగతాయి, హాకీము మహమ్మదు ఖాను, ఆంధ్రదేశమునందు దామెర్ల రామారావు మొదలగువారు రచించిన చిత్రములు భారతీయ చిత్రకళయందు ప్రాచీనసంప్రదాయసిద్ధమైన సంస్కారమును నిరూపించుచు భారతీయుల చిత్ర కళాప్రతిభను విశదముచేయుచున్నవి. ఆంధ్రదేశస్థమైన అజంతాచిత్రములకును వర్తమానచిత్రములకును చిత్ర లేఖనమునందుగల భేదము ఆంధ్రులపతనమును విశదము చేయుచున్నది. ఆంధ్రజాతీయకళాశాలయును, రామా రావుచిత్రకళామందిరమును చిత్రకళాభ్యుదయమునకు జేయుచున్న ప్రయత్నములు కళాభిమానుల పోషణము నకు పాత్రము లగుచున్నవి.

'భారతీయచిత్రకళ'ను రచించిన శ్రీ రామారావు గారు భారతీయ చిత్రకళయొక్క వృద్ధి క్షయము లను, ఔన్నత్యమును సప్రమాణముగ వారి గ్రంథ మునందు వివరించి చిత్రకళాభ్యుదయమున కుపకార మొనరించిరి. ఈ గ్రంథమునందు చిత్రలేఖనోదయము, బౌద్ధయుగము, అజంత గుహలు, బాఘ్ చిత్రములు, మొగలు చిత్రలేఖనము, రాజపుత్రలేఖనము, మొదలగు విషయములకు సంబంధించినవి పద్రెండుఅధ్యాయములు గలవు. అజంతాచిత్రములకు సంబంధించిన పటములును, వర్ణచిత్రములును భారతచిత్రకళాచరిత్రను విశదముచేయు చున్నవి. గ్రంథమునందు గ్రంథకర్త తెలిపిన క్రింది భావ ములు చిత్రకళావికాసావసరమును తెలుపుచున్నవి.

"వేషభాషలందేకాక ఆత్మానుభవమును వెల్లడిచేసి, యాత్మను పరిపక్వము జేయజాలి, జాతీయతను నిలువబెట్టజాలిన లలితకళలందును పాశ్చాత్యభావము లగ్రస్థానమును వహించినను చూచుచు నిద్రా వస్థయం దుండుట యాత్మహత్యను గోరుటకు సమానము. ఈ ప్రమా దమును కొందఱు గ్రహించుటచే తక్కిన జాతీయోద్యమములతోపాటు హైందవచిత్రకళా ప్రపంచమునగూడ సంచలనము కలిగెను.

*    *    *    *    *

భారత చిత్రకళయందు జొరబడిన విదేశీరుచులను బారద్రోలి నిజమగు హైందవవ్యక్తిత్వమును మరల సింహాసనమున స్థాపింపజూచు చున్న యువకులకు అవనీంద్రనాథఠాకురు నాయకుడు. రాజపుత్ర

చిత్రరచనయందు పక్షియావిధానములు కలవు. కాన సుప్రసిద్ధ అజంత, సీగిరియచిత్రములు భారతకళ నుద్ధరించుటకు మూలాధారములుగ నుండ వలయునని వీరి కోరిక. కాని తరువాతి దేశానుభవమును కళాభిమాని మఱవరాదు. రాజపుత్రులచే నామోదింపబడిన విధానములం దనేక ములు వాంఛనీయచిహ్నములు కలవు. జపాను, ఐరోపావిజ్ఞానములచే పోషింపబడిన చిత్రరచనయందును క్రొత్తరుచులు కలవు. ఇంత విశాల భావముతో ప్రారంభమైన చిత్రకళ జాతీయతను నిలుపుకోగలదా యని సంశయింపవచ్చును. ఏదేశపు విజ్ఞానమునైనను తిరస్కరింపక భారతచిత్రముల కట్టుబాట్లను మఱవక వ్రాయుటయే కళకు క్షేమ కరము.

ఆత్మసందర్శనమునకును, దైవసందర్శనమునకును సాధనభూతములైనలలితకళల నాంధ్రు లారాధించి పురుషార్థమును బడయుదురుగాత !

ప్రమోదూత చైత్ర బ. ౮
సోమవారము (౨౧-౪-౯౩౦)

కా. నాగేశ్వరరావు.

౧

# ఒక్క మాట

మన ఆంధ్రదేశమున జాతీయచిత్రకళ ప్రాముఖ్యము వహించుచుండుటవలన రవివర్మ చిత్రములవలనను, పాశ్చాత్యవిద్యవలనను, వ్యాపించిన ఐరోపా చిత్రరచనావ్యామోహము తగ్గజొచ్చినది. ఇట్టియదనున ప్రాచీనకాలమునుండి భారతదేశమున చిత్రకళపొందిన మార్పులను, దానియాధిక్యమును తెలుపుచరిత్ర ప్రజలకందజేసినయెడల నీప్రబోధమునకు లాభము చేకూరుననునాశతో నే నీచిన్నగ్రంథమును వ్రాసితిని.

ఈగ్రంథమును వ్రాయుటయందు "పెర్సీబ్రౌను" గారి 'భారతీయవర్ణలేపనము'ను, 'విన్సెంటుస్మిత్తు'గారి 'హిందూసింహళదేశములందలి లలితకళయొక్క చరిత్ర'ను, ఆధారముగ గొంటిని. మొదటిప్రకరణమున కృష్ణాపత్రికాధిపతులు ప్రకటించిన 'సంక్రాంతి' సంచికయుతోడయ్యెను. ఈగ్రంథకర్త లందఱికి నావందనములు.

ఇట్టిగ్రంథములను కొనువారరుదు కాన ప్రకటించువారును అరుదు. మీదుమిక్కిలి సచిత్రముగ ప్రకటింపవలసినదగుటచే వ్యయమును అధికముగ నగును. కావున గ్రంథప్రకాశకులు దీనిని ముద్రించి ప్రకటించుటకు వెనుదీయుట సహజము. శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు రాజకీయసాంఘికాదులగు

ఉద్యమములకు నాయకులై వానికి ప్రోత్సాహము నొసం
గుచు ఆంధ్రులయౌన్నత్యముకొఱ కెంతయైన త్యాగము
జేయుచున్నవా రనుట క్రొత్త కాదు. నేను ఈ నాదిన్న
గ్రంథమును వారి కర్పించి దానిని వారిని స్వయముగ
చదువగోరితిని. వారును, నాకోరికి ననుసరించి దాని నా
మూలాగ్రము చదివి తమ 'ఆంధ్రగ్రంథమాల'యందు
ప్రచురించుట కంగీకరించి యచిరకాలముననే ఇట్లు ముద్రిం
పించి వెలువరించిరి. వ్యయమునకు వెనుదీయక త్రివర్ణ
చిత్రములతోను, పెక్కు ఏకవర్ణ చిత్రములతోను,
ఇట్లు సుందరరూపమున వెలువరించిన యీపుస్తకము శ్రీ
పంతులుగారి కళాపోషణపరాయణతకు గట్టి నిదర్శనము.
ఇట్లు నాప్రయాసమును సఫలముగావించిన శ్రీపంతులు
గారికి కృతజ్ఞతాపూర్వకములగు నావందనసహస్రములు.
ఇంకను జాతీయచిత్రరచనయెడల విముఖులైయున్న యాం
ధ్రులను కొందఱినైనను ఈగ్రంథము సుముఖులను జేయ
గలిగినయెడల నేను కృతార్థుడ నగుదును.

గ్రంథముద్రణానంతరము భారతీయచిత్రకళాచరి
త్రయందు, కొన్నినూతనాంశములు వెల్లడియైనవి. వానిని
పునర్ముద్రణమున జేర్చుకొందును.

చెన్నపురి.<br>20-4-20 — తలిశెట్టి రామారావు



హర్ష వర్ధన రాజకుమారుడు

చిత్రకారుడు: సత్యేంద్రనాథ బేనర్జిగారు. శ్రీ వి. ఆర్. చిత్రగారి అనుమతిని.

# భారతీయచిత్రకళ

## ప్రవేశాధ్యాయము

భారతదేశము హిందువుల పాలనక్రింద నున్నప్పుడు చిత్రకళ చాల ఉన్నతదశయందుండెను. విదేశీయులు దేశము నాక్రమించిన పిమ్మట హిందూసాంప్రదాయములు రాజసభలయందు మన్ననలను బొందుట యరుదయ్యెను. నిజమెటులున్నను, పాలకులకంటెకి పాలితుల నాగరికత హేయముగ దోచెను. భరతఖండ మించుమించుగ నన్ని శాస్త్రములందును ప్రపంచమునకు మార్గదర్శకమై తన నాగరికతను ప్రాక్పశ్చిమ దేశములందు వ్యాపింప జేసినను, స్వాతంత్రమును గోల్పోవుటవలన, ఉపనిషత్తులకును, భగవద్గీతకును జన్మకారణమైన హిందూమతమును, రామాయణ మహాభారతాది ఇతిహాసములు, పురాణములు శాకుంతలాదికావ్యములు కల హైందవ భాషలను, వేదకాలమునుండి ఘనతవహించి వింతనడక

లతో వినువారి నందరిని బరవశులనుగ జేయజాలు హైందవ సంగీతమును, విదేశీయులు తృణీకరించిరి. వందలకొలది సంవత్సరములు పరుల యాధిపత్యమును స్వీకరించుచు, ఆత్మగౌరవమును, జన్మభూమియొక్క యాధిక్యమును మరచిన భారతీయులకు పాలకులతృణీకారమే పరమసత్యముగ గనబడెను.

మతము, కవిత్వము, సంగీతము, వీనితోపాటు హైందవ చిత్రవిద్యయు పాశ్చాత్యుల కనుసన్నలకు లోనయ్యెను. లలితకళ లిచ్చట శైశవదశయందున్నవని యేబదిసంవత్సరములకు పూర్వము ఆంగ్లేయులు భావించుచుండిరి. హిందూదేశమునుండి తీసుకొనిపోబడిన చిత్తరువులు పాశ్చాత్య చిత్రలేఖన నిబంధనముల ననుసరించియుండకపోవుటవలన వాటిని వింతగ జూచుచుండిరి. ఏదేశమునందైనను నాగరికతతోపాటు లలితకళలును అభివృద్ధి చెందును కాన, అట్టివి హిందూదేశమునందు వారికండ్లకు కానరాకపోవుటచే హైందవు లనాగరికులని వా రభిప్రాయపడిరి. పాశ్చాత్యవిధానముల ననుసరించి గ్రీసు, రోము దేశవాసు లద్భుతములగు శిలావిగ్రహములను నిర్మించిరి కాన ఆయాదేశములను ప్రశం

చమునకు మార్గదర్శకములుగ బరిగణించిరి. *పిరమిడులు మొదలగు వాటిని నిర్మించి నంతమాత్రమున యీజిప్టు (Egypt) దేశీయులు నాగరికులైయుండిరని ఐరోపా వ్యామోహితులకు దోచెను కాని, హైందవ నాగరికతాధిక్యమును కొనియాడువారు లేకుండిరి.

చిత్రలేఖనమునకు సంబంధించిన కళలందు విమర్శకుడని ఖ్యాతిగాంచిన సర్ జార్జి బర్డువుడ్ (Sir George Birdwood) గారు "హిందూదేశపు చిత్రలేఖనమును, శిల్పమును కళలుగ బరిగణించుటకు తగ"వని చెప్పిరి. హృదయమునందు గల యున్నత భావములు మేల్కొని చిత్రలేఖనముగ బరిణమించెనని చెప్పుట కొక్కనిదర్శనమైనను వారికి కానరాలేదు. రాయల్ సొసయిటీ ఆఫ్ ఆర్ట్సు (Royal Society of Arts. చిత్రకళాసమితి) వారిచే "హిందూదేశపు మతవిషయిక శిల్పములందుత్తమమైన"దని కీర్తింపబడిన జావాయందలి బుద్ధవిగ్రహము వీరి కనులకు వికారరూపమున గనబడెను. తరుచుగ బుద్ధుడు పద్మాసనాసీనుడయి యోగనిష్ఠను ఉన్నటులు

---

* ఇవి శిలానిర్మితములు. వీటియందు శిల్పనైపుణ్య మంతగా లేకపోయినను వీటి పెద్దయాకారము ఆశ్చర్యమును గలుగజేయును.

పూర్వులు ప్రదర్శించుచువచ్చిరి. ఇట్టి విగ్రహములందు వీరి కేమియు వింత కానరాలేదు. ఆత్మయొక్క శాంతిని, నైర్మల్యమును, పాపరాహిత్యమును బ్రదర్శించుటకు దిబ్బ రొట్టె యెంత యుపయోగకరమో యిట్టివిగ్రహములు నంతయే యని వారనిరి.

కలకత్తాయందలి చిత్రకళాభవనమున కధికారిగ నుండిన డాక్టరు ఏండర్సన్ (Dr. Anderson) గారు హైందవశిల్పులు సర్వసామాన్యమైన ప్రతిమలనే నిర్మింప గలిగిరని వ్రాసిరి. కాని కొంతకాలమునకు హైందవ శిల్పాధిక్యమును వారు గ్రహించి యింతకంటె ఎక్కువ యనుకూలమగు అభిప్రాయమును వెల్లడించిరి. వెస్టుమకాట్ పండితుడు (Professor Westmacott) కూడ మన శిల్పమును తృణీకరించెను.

రావణుడు దశకంఠుడనియు, బ్రహ్మ చతుర్ముఖుడనియు, వినాయకుడు గజాననుడనియు, రామచంద్రునకు కపులు మిత్రులనియు, విష్ణువాహనము గరుడుడనియు చరిత్రకారులు నమ్మినను, నమ్మకపోయినను, ఇతరులకు మార్గదర్శకులైన పండితులును, వారి ననుసరింప యత్నించు పామరులును, పురాణములే ముక్తికి సాధనములని

భావించు భక్తులును, ఈ యసాధారణరూపములయెడ భక్తి విశ్వాసములతో మెలఁగిరి. ఇట్టివిశ్వాసముగల కళాకోవిదు లీపవిత్రపురాణవ్యక్తుల రూపములను వేనవేలుగ నిర్మించిరి. హిందూదేశమునందును, గ్రీసు, రోము దేశములందును, ఈజిప్టుదేశమునందును సనాతనముగ బూజింపబడిన యిట్టి రూపములను జూచి, "క్రైస్తవేతరుల దేవతలివి" యని హేళనచేయువారు మన పాలకులగుటం జేసి యిట్టిశిల్పరాజములు, చిత్తరువులు కొంత కాలము నిందలపాలయ్యెను. ఇక వీటితో పాటు మన లలిత కళలన్నియు వీరిబుద్ధికి వికారములుగ దోచుట వింతగాదు. లేఫ్ కేడియో హెర్న్ (Lafcadio Hearn) గా పరిస్థితులను గనిపెట్టి, "ప్రతి మతము నందును దైవమును గ్రహించిన వారును, కళాసౌందర్యమున కది యనుకూలములని భావించు వారును, ప్రాచ్యఖండవాసుల దృక్పథమును బోధపరచుకొనిన వారును పెక్కు తలలు, పెక్కు చేతులుకల యిట్టి దేవతాప్రతిమల భవ్యతను జూడగల"రని వ్రాసిరి. అగోచరమును, ఆద్యంత శూన్యమును అగు మహాశక్తియొక్క యనంతరూపము లివి యని వీరు తలచిరి. హిందూమతావలంబకులమగు మన కివి యుగ్గుతో

పెట్టినవి కనుక పాశ్చాత్యుల సంకుచితదృష్టిని జూచి ప్రత్యుత్తరముగ లోలోన నవ్వుకొనుచున్నాము.

పాశ్చాత్యులకు ప్రాగ్దేశముల నాగరికత, రుచులు బోధపడక పోవుటయే యిట్టి పరిస్థితులకు కారణము. జపాను దేశపు చిత్తరువులందు కొన్ని యైరోపా చిత్తరువులను బోలి యుండును; కాన వాటియందలి గుప్తభావములను గనిపెట్టి సారమును చవిజూచిన నాటినుండియు పశ్చిమదేశవాసులకు మన చిత్రకళలయెడ నుండిన తృణీకారభావము తగ్గజొచ్చెను. ఐరోపాయందే కాక, యితర దేశములందును ఈ విద్యలలో ప్రవీణులుండిరనియు, హిందూదేశమునందుకూడ ననాదిగ వీటి పోషణము బాగుగ నుండెననియు వారు తెలిసికొనజాలిరి. అప్పటి నుండియు మన పూర్వులకు చిత్రకళలందు గల యుత్సాహము, ప్రవీణత ప్రపంచమునకు వెల్లడి యగుచున్నవి. శాస్త్రపరిశోధకులు అజంతా, ఎల్లోరా మొదలగు గుహలను గనిపెట్టియు, దేవాలయములను బరిశీలించియు, పురాతన సంస్థాపనలను వెదకియు, చిత్రములయు, శిల్పములయు కాలములను స్థిరపరచి, ఆయాకాలపరిస్థితులనుబట్టి యవి యెట్టిరూపములను దాల్చెనో గ్రహించి, వాటి యాన్న

త్యమును జాటుచున్నారు. జపానుదేశపు చిత్తరువులు హిందూదేశమున వ్రాయబడెనని భ్రమసి, వాటి తార తమ్యమును గ్రహింపక, యీదేశముల వివిధరుచులను దెలిసికొనజాలక, మన యమూల్య నిర్మాణములను దిట్టినవారు ఇప్పుడు తమపొరపాటును గ్రహించిరి. ఈ విషయమై హేవెల్, డాక్టరు ఆనందకుమారస్వామి, మార్షల్, పెర్సీ బ్రౌన్, విన్సెంటు స్మిత్ మొదలగు వారు చేసిన పని కొనియాడదగినది. వెదకినకొలది భారత భూమియందు క్రొత్తవింతలు కానవచ్చుచున్నవి. కొలది కాలమునకు మన చిత్రకళల యౌన్నత్యమును సంశయించువా రరు దగుదురు.

ప్రపంచమునం దంతటను ప్రసిద్ధిగాంచిన ఆంగ్ల చిత్రకారుల సమితియగు రాయల్ సొసయిటీ ఆఫ్ఆర్ట్సు వారు హిందూదేశమునందు నూతనముగ లభించిన చిత్రములను, శిల్పములను జూచి, బర్డువుడ్, వెస్టుమకాట్ మొదలగు వారికి తగిన ప్రత్యుత్తరముగ నిటులు చెప్పిరి:

* కళాభ్యాసకులము, కళావిమర్శకులము, కళాకోవిదులమునగు మాకు భారతీయుల యుత్తమ శిల్పములందు వారి మత విషయిక

* "We, the undersigned artists, critics and students of art.........find in the best art of India a

పవిత్రభావ సంజనిత హృదయ సంచలనముల యందును, దైవ విషయ
మున వారి గంభీర భావముల యందును సుసమగ్రసమున్నత కళా
ప్రదర్శనము గోచరమైనది. బుద్ధుని పవిత్రప్రతిమ ప్రపంచమునందలి
యుత్తమ కళాజీవములలో నున్నతావేశ జనకము. జీవ కళాపరిపూర్ణ
మును, వ్యక్తిత్వనిభాసితమును, విచిత్రశక్తి సంపన్నమునునగు కళావిభ
వము భారతీయుల కమూల్యైశ్వర్యము. భారతీయులు, కళావిషయ
మున వారి యద్భుతకార్య దక్షత నాదరించు నితరులు నీ కళావిభ
వమును భక్తితోను, ప్రేమతోను ఆదరింప దగుదురు. దీనినిబట్టి
తరతరములనుండి ఆచారప్రాయముగ ఛాయాచిత్రమాత్రములుగ ప్రతి

---

loftly and adequate expression of the religious emotion of the people and of their deepest thoughts on the subject of the divine. We recognise in the Buddha type of the sacred figure one of the greatest artistic inspirations of the world. We hold that the existence of a distinct, a potent, and a living tradition of art in a possession of priceless value to the people and one which they, and all who admire and respect their achievements in this field, cught to guard with the utmost reverence and love while opposed to the mechanical stereotyping of particular traditional forms, we consider that it is only in the organic development of the national art of the past that the path of the progress is to be found. Confident that we here speak for a very large body of qualified European opinion, we wish to assure our brother craftsmen and students in India that the school of

ముల. నిర్మించుట నమూనాచరణను బహయాదు; కాని భారతీయుల పూర్వజాతీయకళలనుండియే వారి కళాభివృద్ధికి మార్గ మేర్పడగలదని నమ్మెదము. ఐరోపీయ సుప్రసిద్ధకళాకోవిదులలో నధికుల యభిప్రాయ మిదియేయని మా నమ్మకము. భారతజాతీయ కళాసాధకులు, హైందవ జీవమును, హైందవ భావములను ప్రదర్శించుటయందు తమ కౌశలమును, విచిత్రశక్తులను జూపగలిగినంతవరకు, వారు తమ జాతీయకళయెడ విశ్వాసముతో మెలగునంతవరకు మా యభినందనములకు పాత్రు లయ్యెదరు. ఇతర దేశములందు వారి కనుకూలమగుదానిని, వారి వ్యక్తిత్వమునకు వినాశకరము కాకుండుదానిని, సవినయముగ బరిగ్రహించుచు, భారత భౌతికపరిస్థితులవలన, భారత దేశ చరిత్రవలన, భారత సనాతనమతధర్మములవలన నేర్పడిన వ్యక్తిత్వమును భారతదేశమునకే కాక ప్రాచ్యఖండముల కంతకును జగజ్జేగీయమానమగు కీర్తి దెచ్చిన భారతజాతీయకళాసంపదను గోలుపోవుట కెంతమాత్రము నెడమీయరాదు.

---

national art in that country, which is still showing its vitality and its capacity for the interpretation of Indian life and thought, will never fail to command our admiration and sympathy so long as it remains true to itself. We trust that, while not disdaining to accept whatever can be wholesomely assimilated from foreign sources, it will jealously preserve the individual character which is an outgrowth of the history and physical conditions of the country, as well as of those ancient and profound religious conceptions which are the glory of India and all Easte n world."

సర్ పర్డన్ క్లార్కుగారు (Sir Purdon Clarke) హైందవ చిత్రకళల కగ్రస్థానము నివ్వకపోయినను, భారతీయులకును, భారతభూమికిని భారతకళలే తగినవని యొకానొకచోట జెప్పిరి. భారతనాగరికతా నిర్మితము లగుటవలన నవి యిటు లుండకతప్పదు.

ప్రకృతి దేవుని రూపమనియు, అందు ప్రాపంచిక శక్తులు మూర్తీభవించి యున్నవనియు, తత్కారణమున నది పూజార్హమనియు హిందూదేశీయులు భావింతురు. మనము చేయు సాంఘికసేవ, జంతుసేవ మొదలగు సత్కార్యము లన్నియు దైవారాధనయని వీరి నమ్మకము. ఏకార్యమును జేయ ప్రారంభించినను జయము నపేక్షించి మనసార భగవంతుని ప్రార్థించెదరు. వారి దైనిక కార్యక్రమము దేవ హితాచారబద్ధము కాన, దానికి వ్యతిరిక్తముగ ప్రవర్తించుట మోక్షదాయకుని యాగ్రహమునకు గురియగుట యని విశ్వసించియున్నారు. అట్టియెడ మన లలితకళలయందు మతము ప్రాముఖ్యము వహించుట వింత కాదు. మన దేవాలయములందు శిల్పనైపుణ్యమును శిల్పులు విరివిగ జూపించుటకును, దేశమునం దంతటను గనబడుచున్న శిల్పములలో

నధికాంశము మతమునకు సంబంధించియుండుటకును, బౌద్ధదేవుని జీవితము, శ్రీకృష్ణుని లీలలు, రామచంద్రుని సచ్చీలము చిత్తరువులందు విశేషముగ భారతీయులు ప్రదర్శించుటకును కారణ మిదియే.

పశ్చిమదేశీయుల దృక్పథము వేరు: కోరిక లేకుండ శుద్ధపరబ్రహ్మము నారాధించుటకంటె ధనార్జనము, వ్యక్తి సౌఖ్యము, సంఘాభివృద్ధి వారికి ముఖ్యములు. ఈ హేతువున వారి చిత్రకళలకు మత మాధారము కాదు. దైవాభివర్ణన యందున్నను లేకపోయినను అవి యింపుగ నున్న వారు తృప్తి జెందెదరు.

ఇట్టి విభిన్న జీవితాశయములు కల లలితకళలు వేరురూపములను దాల్చుటచే ఐరోపీయ కళావిధానముల నాధారముగ గొని చిత్రించిన రవివర్మగారు హైందవ జాతీయకళల నభ్యసించిన వారికంటె నెక్కువగ పాశ్చాత్యదేశములందు కీర్తి బడసిరి. స్వదేశమగు జపానున బాగ ఖ్యాతి బడయజాలని హోకుసాయి (Hokusai) గారు మిల్లెట్, విస్లర్ (Millet & Whistler) మొదలగు ఐరోపీయుల స్తుతికి పాత్రులైరి.

పాశ్చాత్య కళాకోవిదుడు తన చిత్తరువును ప్రకాశము, ఛాయ, వర్ణములతో ప్రకృతియందు వివిధ

వస్తుజాల మెటులు కానవచ్చునో యటులే ఛాయారూప మాత్రముగ జిత్రించును. వస్తువుల పొందిక, వర్ణవిభేదము, వికారసౌందర్య ప్రదర్శనము మొదలయినవాని వలన నీతడు చూపరుల నాకర్షించి, తన హృదయము నందుగల యున్నతాదర్శములను, పవిత్రభావములను వారికి బోధచేయును. జనులను మొదట నాకర్షించి, చిత్తరువులం దభిరుచిని గలుగజేసిన కాని వారికి గంభీర భావములు మనంబున నాట బ్రయత్నించుట యసంగత మని వీని వాదము. పాశ్చాత్యుల ప్రార్థనమందిరములును, గానసభలును సాంఘికములు. చిత్రకారుడును తన చిత్తరువులను పలువురు జనులు చూచి యానందించుట కుద్దేశించి చిత్రించును.

భారతీయుల దైవారాధనము, సంగీతము ఏకవ్యక్తిత్వమును గోరును. ఒకవ్యక్తి చూచి, యానందించి, యందు సాధారణముగ గుప్తపరచిన భావమునందు మగ్నుడై, భావప్రపంచమున గొలదికాలమైనను మెలగ నుద్దేశింపబడెను కాన బౌద్ధులచే సృజింపబడినవి కాక తక్కిన ప్రాగ్దేశపు చిత్తరువు లన్నియు రేఖలతో చిన్నవిగ జిత్రింపబడెను. వ్యక్తియొక్క హృదయసంస్కరణమున కేకాంతవాసము ముఖ్యమని మన ఋషులు లోక

మునకు తమ జీవితములవలన జూపిరి. వారికిని, బుద్ధుడు మొదలగు మతసంస్కర్తలకును జ్ఞానోదయ మేకాంతముననే కలిగెను. అట్టియెడ భారతీయ చిత్రములు వ్యక్తికొరకు వ్రాయబడుట యుచితము.

లలితకళ లితరశాస్త్రములపై నాధారపడియుండ కూడదనియు, నీతిని నేర్పకపోయినను కళావిధానముల ననుసరించినయెడల చాలుననియు నొక వాదము కలదు. అట్టికళలు భారతదేశమున నరుదు. హైందవులు తమకు గల సర్వస్వమును దేవున కర్పింతురు. కాన ప్రత్యేకము వారు సృజించు కళలుమాత్ర మన్యములుగ నుండుట యసంభవము. ఇట్టి కట్టుబాట్లను హైందవ చిత్రకారుడు లక్ష్యపెట్టడు. ఏలయన—

భారతశిల్పి స్వతంత్రుడు. వస్తువుయొక్క యాకృతిని తన యిష్టము వచ్చినట్లు మార్చగలడు. భావము వస్తువునకు దాస్యము చేయుట కెంతమాత్రము నొప్పుకొనడు. వస్తువును భావప్రాబల్యముచే రూపాంతరము నొందించును. అస్థిసంస్థానవిద్యకు (anatomy) కట్టుబడడు. భారత చిత్రకారుడు చిత్రించునది భావము యొక్క రూపము; భావముయొక్క పరిమాణము; భావముయొక్క లావణ్యము; భావముయొక్క సాదృశ్యము. వస్తువు భావము ననుసరించుచుండవలసినదే కాని, భావము వస్తువునందు బంధింపబడదు. పాశ్చాత్యశిల్పులు వాస్తవజగత్తు నొక బంధిఖానాగా జేసికొని యెంతకాలమును దాని

యావరణలో దిరుగుటయేకాని, దాని ద్వారమును దెరచి, విముక్తలగుటకు జూడరు. భారతశిల్పి యీ వాస్తవ జగత్తును "పద్భ్యాం పృథ్వీ" దేవతలకు బాదపీఠముగ జేయగల్గెను. వానిని జగత్తులో బంధింపలేదు. కమలములపై లక్ష్మీదేవి నధిష్ఠింపజేసెను; నాగముపై చతుర్భుజుని బరుండబెట్టెను; వృషభముపై శివుని గూర్చుండబెట్టెను; వటపత్రమున నారాయణుని నిలిపెను; హంసపై సరస్వతి నూరేగించెను; విష్ణువును జతుర్భుజుని జేసెను. భూలోకముపై స్వర్గకాంతులను బ్రసరింపజేయుటయే భారతశిల్ప లక్షణము.'—కృష్ణాపత్రిక సంక్రాంతిసంచిక.

భారతశక్తి యపారము. భారతనాగరికతయొక్క పటుత్వము మరేనాగరికతకును లేదు. మన మతము బౌద్ధ, జైన, మహమ్మదీయ, క్రైస్తవ మతముల నాకర్షించి యందలి సారాంశమును జీర్ణించుకొని, నూతనరూపముల బ్రజ్వలించెను కాని వాటి యాధిపత్యమునకు తావొసంగలేదు. ఇటులే హైందవ శిల్పము ఇతరదేశపు శిల్పవిద్యల నాకర్షించి క్రొత్తమార్గముల గనిపెట్టి ఖ్యాతి జెందెను. తక్షశిల (Taxila) యందు మొదట ప్రారంభమై గాంధారదేశమునం దంతటను వ్యాపించిన యవనశిల్పము దీనికి ప్రబలనిదర్శనము. పశ్చిమఖండమున బ్రసిద్ధిగాంచిన యిది హైందవశిల్పమునందు లీనమయ్యెను. భారతభూమియందు వాటిరూపు చెడెనని కొందరు పాశ్చాత్య పండితులు తలచినను, హైందవ నాగరికత వీటిని నిజమగు

దేశీయకళాభాగములుగ మార్చెనని డాక్టరు కుమారస్వామి, హేవెల్ మొదలగు పండితులు చెప్పుచున్నారు. అక్బరు చక్రవర్తికాలమున మొగలాయీల చిత్రములు మనదేశమును బ్రవేశించి, రాజుల మన్ననలను బొందినను, కొంతకాలమునకు భారతదేశీయుల మనోభావములకు లోనయ్యెను. వేలకొలది సంవత్సరములందు జరిగిన మార్పులలో హైందవవ్యక్తిత్వము ప్రజ్వలించెను. అజంతా చిత్రములకును, మొగలు చిత్రకళావిధానముల ననుసరించిన రాజపుత్రచిత్రములకును తారతమ్యమున్నను, హైందవవ్యక్తిత్వము మాత్రము ప్రబలముగ వీటి యన్నిటి యందును గానవచ్చును.

అజంతా చిత్రకారులు వారికుంచెల నొక మూల బడవేసిన నాటినుండియు, భారతభూమియం దీకళ క్షీణదశకు వచ్చెను. రానురాను రాజపోషణ యరుదగుట వలన బ్రజలయుత్సాహము తగ్గినటులు గానబడుచున్నది. ఈకారణములవలన హైందవ చిత్రలేఖన చరిత్రయందలి మొదటి ప్రకరణములను వ్రాయుటకు తగిన యాధారములు లేవు. అజంతా, సీగిరియా మొదలగుచోట్ల కుడ్యములపైనున్న చిత్తరువులును, పురాణాది గ్రంథముల

యందు గానవచ్చువర్ణనలును కొంత మార్గదర్శక ములుగ నున్నవి. లభించిన చిత్తరువులను క్రమముగ పరిశీలించి చూచినయెడల భారతభూమి యీ కళయం దితర దేశములకు వెనుకబడ లేదని గ్రహింపగలము.

మన దేశమున మహాపవిత్రమైనవాటితోపాటు నసహ్యాకరములును, మానభంగకరములును నగు శిల్పములు, చిత్తరువులు కలవు. ఇట్టివి యమూల్య శిల్పనైపుణ్యమును జాటు దేవాలయ కుడ్యముల కెటు లెగబ్రాకినవో తెలియదు. విషయలోలురగు యువకు లర్పించు ధనమున కాసించి, శ్రీకృష్ణుని జీవితచరిత్రమున కపార్థములను గల్పించు అసభ్యములగు చిత్రములను రాధాకృష్ణులపేరను జిత్రించుచు వచ్చిరి; ప్రబంధములందును, సంగీతమునందును ఇట్టి భావము లచ్చటచ్చట గానవచ్చును. ఇంతమాత్రమున హైందవలలితకళలను విడనాడ జనదు. ఇట్టి శిల్పములందును, చిత్తరువులందును విశేషము కళానిపుణత కానరానందున నివి యల్పుల కృత్యములని నిర్ధారణ చేయనచ్చును. ఇదియునుకాక వీటిసంఖ్య యల్పముగ నున్నది.

విగ్రహారాధనకు మన దేశము పుట్టినిల్లు కాన కొన్ని ప్రసిద్ధవిగ్రహములవలె ఉదరపోషణార్థము వందల

కొలది విగ్రహములను కొందరు నిర్మించి విక్రయించు చున్నారు. ఇదివరకు ఖ్యాతిగాంచిన దేవాలయము నను సరించి యింకొకరు నిర్మింప యత్నించునప్పుడు కూడ ఇతర శిల్పావలంబనము నిరాటంకముగ జరుగుచుండెను. ఇట్టివి మన దేశమునందంతటను కాన వచ్చును. ఉత్తర మున వ్యాపించియున్న బుద్ధవిగ్రహములును, దక్షిణమున ప్రఖ్యాతిగాంచిన "నటరా"జను తాండవ శివుని విగ్రహ ములును దీనికి నిదర్శనములు. మొగలాయీల కాలమున ప్రఖ్యాత పురుషులయొక్క రూపచిత్రములను జిత్రించి విక్రయించుచు ననేకులు జీవించుచుండిరి. ఇట్టి శిల్పములు, చిత్రములు కళాభాగములుగ గణింపబడవు. వీటికి కారణ భూతములైన సుప్రసిద్ధశిల్పములయు, చిత్రములయు కళా నిపుణత వీటి కుండుట యసంభవము.

హైందవ మనగా నేమి? అజంతా చిత్తరవులం దచ్చటచ్చట పర్షియాదేశపు చిత్రలేఖన విధానము కాన వచ్చుచున్నది. కాని యన్నిటిని బరిశీలించి చూచిన యెడల వీటియందును, సీగిరియాయందును పాశ్చాత్యులు విశేషముగ జోక్యము కలుగజేసికొనలేదని కానవచ్చును. మొగలాయీల ప్రభుత్వమునందు వారిదేశపు చిత్రలేఖన

విధానములను దేశమున ప్రవేశపెట్టినప్పుడు, ఉత్తరమున రాజపుత్రస్థానమునందును, దక్షిణమున తంజావూరు నందును కళాభ్యాసకులు పొట్టపోసుకొనుటకై యీనూతనవిధానముల నామోదించినను హైందవ వ్యక్తిత్వమును మాత్రము మరవలేరి. ఆంగ్లప్రభుత్వముక్రింద మనవారైరోపావిధానములను గొంతవరకు నభ్యసించినను, తమ తప్పిదమును గ్రహించి దేశీయముల నిప్పుడు ప్రారంభించిరి. భారతభూమియందు పారశీలు, మహమ్మదీయులు, క్రైస్తవులు లక్షలకొలది నివసించుచున్నను, చిత్రములను జిత్రించుచున్నను, ఎవరికి దోచినటులు వారు క్రొత్త త్రోవలను ద్రొక్కుచు నూతనములైన రుచులను జూపుచున్నను, నిజమైన హైందవచిత్రము లెవ్వియన మన దృష్టి అజంతా, సీగిరియాల వైపునకు బోవును. తక్కిన చిత్తరువు లన్నియు పాశ్చాత్యవిధానములచే కల్మషములైనవి. వీటియందు కానవచ్చు హైందవవ్యక్తిత్వము అజంతా గుహలయందు మూర్తీభవించియున్నది. అజంతాచిత్తరువులు హిందువులచే వ్రాయబడెను. రాజపుత్ర చిత్రములందు గానవచ్చు హైందవ వ్యక్తిత్వము హిందూమతమునకు సంబంధించినది. మహమ్మదీయ, క్రైస్తవ

మతములు విదేశీయము లగునటులు మతస్థులు మనకు జూపిన చిత్రలేఖనవిధానములు విదేశీయములు. అందు వలన హైందవ మనగా హిందువులకు సంబంధించినదని మనము నిర్ధారణచేయవచ్చును.

---

# ఒకటవ అధ్యాయము

## హైందవ చిత్రలేఖనోదయము

అజంతా, సీగిరియాలయందుగల సుప్రసిద్ధములగు చిత్తరువులను వ్రాయుటకు బూర్వము భారతభూమి యందీవిద్య యభివృద్ధి చెందియుండెనని చెప్పుటకు ప్రబలాధారములు విశేషముగ గానరాకయున్నవి. మానవు డెంతప్రయత్నించినను పూర్వసాంప్రదాయములు లేనిది యిట్టి చిత్తరువులను తొలుదొలుతనే వ్రాయజాలుట యసంభవము కాన తురుష్కులైనను, యవనులైనను, మన దేశమునకు వచ్చి చిత్రరచనను నేర్పిరనియు, తదుపరి అజంతా మొదలగు గుహాలయందలి చిత్తరువులు నిర్మింప బడెననియు గొందరూహించుటకు వీలు కలుగుచున్నది. విదేశీయుల రాకపోకలు కలచోటుల నజంతా గుహ లుండుటవలన నిట్టియూహలకు బలము కలిగెను. కాని ఉత్కళమునందును, తదితరస్థలములందును కానవచ్చు చిత్తరువులను జూచిన నీవాదము ఊహామాత్ర

మని తోచును. అజంత మొదలగు గుహాల చిత్తరువు లకు, పాశ్చాత్య చిత్రములకు నెట్టిసంబంధము గాన రాకయున్నది. ఆకాలమునాటి తురుష్క చిత్రములకంటె అజంత చిత్తరువు లెన్నియోరెట్లుత్తమముగ నున్నవి. తురుష్క హైందవాది ఆసియాఖండపు చిత్రకళావిధానములకు తురుష్కస్థానము జన్మస్థలమై యుండిన నుండ వచ్చును కాని, మన దేశమున నీవిద్య ప్రత్యేకముగ నభ్యసింపబడి, నూతనమార్గముల ద్రొక్కి యున్నత దశకు వచ్చెనని చెప్పజాలుటకు తగినన్ని నిదర్శనము లున్నవి. పిమ్మట హైందవ చిత్రవిద్య యితర దేశములందు గౌరవింపబడెననియు, అభ్యసింపబడెననియు చెప్పుటకును నిదర్శనము లున్నవి.

చిత్రరచన, వర్ణలేపనము హిందూ దేశమున రెండు వేల సంవత్సరములకు బూర్వము నుండియు నభ్యసింపబడుచుండెను. తరువాత వ్యాపించిన శిల్పవిద్య కిది మార్గదర్శక మయ్యెను. ఆకాలమున యైరోపా శైశవ దశయందుండుటయే కాక, ఇటీవల పదునాలుగు, పదునైదు శతాబ్దములవరకు నచ్చట నిట్టి చిత్తరువులను వ్రాయజాలక పోయిరని విన్సెంటు స్మిత్తుగారి యభిప్రాయము.

కాని ఆకాలపు చిత్తరువు లిప్పు డింత యల్పముగ గాన వచ్చుటకు హైందవ వాతావరణమే కారణము. మన పూర్వులచే గోడలమీద జిత్రింపబడిన చిత్తరువులన్నియు వర్షజలాపాతమున దడిసి, మండువేసవియందు బీటలు వారి నశించినటులు గోచరించు చున్నది.

కైమూరు పర్వతములందుగల గుహాకుడ్యములపైన పురాతనములయిన చిత్తరువులు కొన్ని కానవచ్చుచున్నవి. వింధ్యపర్వతములందు కూడ నిట్టి చిత్తరువులు, కొంత యెరుపురంగు, రంగులను నూరెడు రాతిపలకలు లభించినవి. ఈచిత్తరువులు మంచివి కాకపోయినను హిందూదేశమునందలి చిత్రవిద్యకు తొలిప్రయత్నము లగుటజేసి, చరిత్రకారుల దృష్టి నాకర్షించినవి. కొలది కాలముక్రిందట మధ్యపరగణాలందలి రామగడ రాజ్యమునకు జేరిన సంగనుపురము దగ్గర గుహాముఖమున నొకరాతిపై నెరుపువర్ణముతో వ్రాయబడిన కొన్ని చిత్తరువులు లభించెను. ఇచ్చట మానవుని తొలిరాతిపనిముట్లుకూడ దొరకుటచే నీచిత్తరువులు వేలకొలది సంవత్సరములకు బూర్వము వ్రాయబడెనని స్పష్టమగుచున్నది. ప్రపంచమునందంతటను మానవుడు ప్రథమమున క్రూరమృగములను,

ఆహారమునకు దగిన మృగములను వేటాడి తనకాల మును గడపుచుండెను కాన నీత డిట్టి చిత్తరువులనే రచించుచుండెను. ఇచ్చటి చిత్తరువులును వేటకు సంబంధించినవి. ఇందు ఏనుగు, లేడి మొదలగు జంతువు లనేకరకములు వ్రాయబడినవి. ఒకచోట నొక యెనుబోతును జయించు యతనమున ననేకమృగయులు దానిచే పరాభవింపబడినటులు గలదు. మరియొకచోట నొక యెనుబోతును వేటకాండ్రు తమబల్లెములతో బొడుచుచున్నటులును, తమ ప్రయత్నఫలమును జూచి తక్కినవా రానందించు చున్నటులును కలదు. ఇందు కొన్ని చిత్తరువుల యర్థ మంతగా తెలియకున్నను, హైందవ పురాతనచిత్రకారుడు కొంత ప్రవీణతను సంపాదించెనని తోచును.

మీర్జాపురముజిల్లాయందు కూడ పురాతనములయిన చిత్తరువు లనేకములు కానవచ్చుచున్నవి. ఈ ప్రదేశమునకు సమీపమున సురుగుజా రాజ్యమునందలి రామగడ పర్వతమున గల 'జోగిమారా' యని పిలువబడు గుహాలయందు చిత్తరువులు కలవు. వీటిపై నితరులెవరో దిద్దుటవలన నివి తొలిరూపుచెడి వికారముగ గనబడును కాని నిదానించి చూచినయెడల మొదటి సౌంద

ర్యము గ్రహింప వీలగును. ఎరుపు పసుపు వర్ణములతో చదరమునందు చదర మిమిడియున్నటు లివి కలవు. ఈ చదరముల చుట్టు మకరము మొదలగు నీటిజంతువుల రూపము లలంకారముగ గలవు. చదరములందు మనుష్యులయు, జంతువులయు, వృక్షములయు నాకారము లున్నవి. ఒక చదరమునందు చెట్టుక్రింద నొక పురుషుడును, ఎడమవైపున గాయకులతో నొక నర్తకియు, కుడివైపున ఏనుగులతో నొక యుత్సవమును కలవు. మఱియొక చదరమున నొక దిగంబరుడును, రథము, ఏనుగు మొదలగు రాజచిహ్నములును కలవు. ఈ చిత్తరువుల యర్థము పూర్తిగ తెలియకపోయినను, దిగంబర విగ్రహమువలన నివి జైనులకు జెందినవని తోచును. తెలుపు, నలుపు, ఎరుపు, పసుపు రంగులతోమాత్రమే యివి వ్రాయబడుట వలనను, ఇచ్చటగల శాసనములవలనను, సాంచి, బార్‌హత్ నందుగల శిల్పములతో బోల్చి చూచుట వలనను, ఇవి చాల పురాతనము లనియు, బహుశః క్రీస్తుకు పూర్వము మొదటిశతాబ్దమునాటి వనియు గోచరించును. తరువాతి చిత్తరువులతో సరి పోల్చి చూచిన యెడల నివి హైందవ చిత్రలేఖనము యొక్క శైశవదశకు జెందినటులు గాన్పించును.

పైన జెప్పిన చిత్తరువులందు కళానైపుణ్య మంత గా కానరాదు. ఎంత వెదకిన నిదివరకు నితరాధారములు లభించలేదు. అజంత, సీగిరియా చిత్తరువులను, అప్పటి వాఙ్మయమును బరిశీలించిన నంతకు పూర్వమే యీవిద్య యున్నత దశయం దుండెనని స్పష్టపడుచున్నది. ఈవిరుద్ధ నిదర్శనములను జూడ జోగిమారా గుహల చిత్తరువులు కళాజ్ఞాన మల్పముగ గలవారిచే చిత్రింపబడియుండవలెను; లేక, వాఙ్మయమునందు కవులు తక్కిన వర్ణనలవలె నీకళనుగూడ మితిమీర బొగడి యుండవలెను - అని తోచును. కవుల యుత్ప్రేక్ష కొంత యథార్థము కావచ్చును కాని అజంత గుహల చిత్రసౌరభమును బట్టి చిత్రలేఖనము మహోన్నతదశయం దుండెననియు, మధ్య రెండువందల సంవత్సరములందు లిఖింపబడిన చిత్తరువులు నశించెననియు జెప్ప సాహసింపవచ్చును.

వేదము, తదితరవిద్యలు దేవతలవలన మనకు లభించెనని వాడుక. చిత్రలేఖనోత్పత్తి విషయమైకూడ నిట్టికథ యొకటి కలదు. పూర్వ మొకబ్రాహ్మణపుత్రుడు మరణింప నాతనితండ్రి దుఃఖము నాపజాలక పుత్రభిక్ష నిమ్మని యముని ప్రార్థించెను. యమునిహృదయము

కరగలేదు. అంత నాభూసురుడు బ్రహ్మను ప్రార్థించెను. సృష్టికర్తయగు నీవేల్పు పంచభూతములలో లీనమైన దేహమును మరల సృజింపజాలక యాకుమారుని రూపమును వ్రాయుటను నేర్పి, కుంచెలను, రంగులను ప్రసాదించెను. బ్రాహ్మణుడు తన ప్రియకుమారుని రూపమును స్మరించి యొకవిగ్రహమును నిర్మింప, దానియం దాదేవుడు ప్రాణమును బోసెను. తరువాత నీవిద్య యెల్లెడల వ్యాపించెను. ఈకథ నిజమయినను, కాకపోయినను, చిత్రలేఖనమునందు హిందువుల కెట్టి గౌరవము కలదో దీనివలన తెలియగలదు.

రాజగృహములందు వివాహము తలపెట్టినప్పుడు రాకొమరితలయు, రాకొమరులయు చిత్రపటములను తరుచుగ నుపయోగపరుచుచుండిరి. కొన్ని సమయములందు వీరి యన్యోన్యప్రేమ కివి కారణము లయ్యెను. దీని నుదాహరించుట కొరకు ప్రసిద్ధిజెందిన చక్కని కథ పురాణములందు గలదు. “శ్రీకృష్ణుని మనుమడగు అనిరుద్ధుడు ఉషయను రాజకన్యకకు స్వప్నమున గాన్పించెను. ఆమె తన చెలికత్తెయగు చిత్రలేఖ కీవార్త వెలిపి యాసుందర యువకు డెవడని సంశయించెను. చిత్రలేఖ

తనకు తెలిసిన అందలు రాకొమరుల చిత్రములను వ్రాసి చూప ఉప స్వప్నమున తన హృదయమును హరించిన వానిని పోల్చగలిగెను. కొంత కాలమునకు 'వారిరువురికి వివాహమయ్యెను." రామాయణ మహా భారతములందు చిత్రశాలల వర్ణనలు కలవు. భాసుడు, కాళిదాసు, భవభూతి వ్రాసిన గ్రంథములందును చిత్ర కళను గూర్చి కలదు. వ్యక్తుల కాలిగోరును, దలవెంట్రు కలను, ఇతరావయవములను జూచి వారి రూపచిత్రము లను వ్రాయుట కలదని చెప్పుట వినుచున్నాము.

హిందూవాఙ్మయమునందే కాక బౌద్ధుల వాఙ్మ యమునందును చిత్రలేఖనము సామాన్యముగ నుండె నని చెప్పుటకు చాల నిదర్శనములు కలవు. క్రీస్తుకు పూర్వము నాల్గవశతాబ్దమున పాళీభాషయందు వ్రాయ బడిన బౌద్ధుల "వినయపిటక"మను గ్రంథమందు 'పాసె నాడ' నృపుని చిత్రగృహ మనేకములగు చిత్రములచే నలంకరింపబడెనని కలదు. సయాము దేశమున అంకోరు నందును, జావాద్వీపమున బోరుబందరునందును చిత్ర శాలల చిహ్నములు కానవచ్చుచున్నవి. దుత్తగామిని యను రాజుచే నిర్మింపబడిన డగోబా చిత్తరువులచే

నలంకరింపబడెనని మొదవ శతాబ్దమున వ్రాయబడిన "మహావంశ"మను గ్రంథమున గలదు.

ఈనిదర్శనములనుబట్టి చూడ మనన్నృపులీకళను విశేషముగ నాదరించుచుండిరని తెలియును. లాఫర్ గారు చిత్రలేఖనము రాజగృహములందే జన్మించెనని తలచు చున్నారు. ఇవన్నియు అజంత, సీగిరియా చిత్రరువుల వలె గోడలమీదనే వ్రాయబడుట స్పష్టము. ఇప్పటికిని హిందూదేశమున గొన్ని భాగములందు ఉత్సవములకు గోడల నలికి వాటిపై చిత్తరువులను వ్రాయుదురు. ఆంధ్రు లును ముగ్గులతోను, బొమ్మలతోను ఇండ్లను, గోడలను అలంకరించుచున్నారు.

ఐదు, ఆరు, ఏడు శతాబ్దములందు చైనాదేశము నుండి వచ్చిన యాత్రికులు బౌద్ధుల చిత్రకళానైపుణ్యము నధికముగ గొనియాడియున్నారు. పదునేడవ శతాబ్ద మున టిబెట్టునందు నివసించియుండిన తారానాధుడను బౌద్ధచరిత్రకారు డీకళ బుద్ధునకు బూర్వమునుండియు ప్రసిద్ధి జెందియుండెనని వ్రాసెను. పురాతన కుడ్యచిత్ర ముల సౌందర్యమును జూచి యవి దేవతలచే జిత్రింపబడి యుండవలెనని అతడు తలచెను. అశోకునిచే నియమింప

బడిన యక్షులును, నాగార్జునుని యాధిపత్యముక్రింద నాగులును చిత్రములను జిత్రించుచు వచ్చిరని వీరు వ్రాసిరి.

ఒకానొక రాజున కర్పించుట కొకచిత్రకారుడు గౌతముని యెదుటనే గౌతముని రూపమును జిత్రించుచున్నటులును, ఆచిత్తరువును జూచి యానృపు డాశ్చర్యపడి దాని నారాధించుచు బౌద్ధమతమును స్వీకరించినటులును టిబెట్టునందు చిత్తరువులు గలవు. పూర్వమును రూపచిత్రములను వ్రాయుట కలదనుట కది మఱియొక చక్కని నిదర్శనము.

బౌద్ధుల కాలమునకు పూర్వమే చిత్రలేఖనము విషయమై కొన్నినిబంధన లేర్పడినటులు కానవచ్చుచున్నది. మూడవ శతాబ్దమున వాత్స్యాయనుడు తన కామశాస్త్రమునందు రూపభేదము, ప్రమాణము, భావయోజనము, లావణ్యయోజనము, సాదృశ్యము, వర్ణికాభంగము చిత్రలేఖనమునకు షడంగములని వ్రాసెను:

శ్లో. రూపభేదాః ప్రమాణాని భావలావణ్య యోజనమ్;
సాదృశ్యం వర్ణికాభంగ మితి చిత్రం షడంగకమ్.

౧. రూపభేదము: మానవులు, జంతుజాలములు, తదితరవస్తువులు ప్రకృతియం దెటులు గానవచ్చునో చిత్ర

కారు డెరుంగవలెను. వీటి వివరములు, వివిధవస్తువులకు గల భేదము చిత్తరువునందు ప్రదర్శించుట ముఖ్యము:

శ్లో. అంగాన్యభూషితాన్యేన కేనచి ద్భూషణాదినా;
యేన భూషితవ ద్భాతి తద్రూప మితి కథ్యతే.

ఐరోపాచిత్తరువులందువలె, ఛాయాచిత్రములందువలె వస్తువులరూపములు చాయవెలుతురులవలన స్ఫుటముగ దెలియును. కాని హైందవచిత్రకారు లీప్రకృతిజ్ఞానము నొకమూల ద్రోసి, రేఖలతో తమచిత్తరువులను నిర్మించిరి. లోకమునగల యన్నిటియొక్క రూపములయర్థమును గ్రహించి, యాలోపలి రహస్యమును వెలిపుచ్చుట శిల్పియొక్క పవిత్రమైన విధి. ఛాయాచిత్ర మాత్రముగ వ్రాయుటకంటె నిది యెక్కువ ప్రయోజనకారి.

౨. ప్రమాణము: ప్రతివస్తువుయొక్క పరిమాణము చిత్తరువునందు చాల అవసరము. ప్రకృతియందు కొన్ని వస్తువులు పెద్దవిగను, కొన్ని చిన్నవిగను ఉండును. పర్వతము, ఏనుగు చూపరుల కొకేదూరమున నున్నప్పుడు ఏనుగుకంటె పర్వతము పెక్కురెట్లు పెద్దదిగ గానబడును. కాని ఏనుగు దగ్గరగను, పర్వతము దూరముగను నున్నప్పుడు పర్వతమే చిన్నదిగ కన్పించవచ్చును. కాని

హైందవచిత్రకారునకు ఆధ్యాత్మికచింత ముఖ్యమని జ్ఞాపక ముంచుకొనవలెను. మాయాదేవి నిద్రించు చున్నటు లొకశిల్పము కలదు. ఇందు మాయాదేవి ముఖ్యము. తక్కిన వన్నియు నాధ్యాత్మికదృష్టియందు చిన్నవి. ఆమె పండుకొనియున్న శయ్య, చుట్టునున్న పరిచారికలు మాయాదేవికంటె పెక్కురెట్లు చిన్నగ చిత్రింపబడిరి. ఇట్టి శిల్పము లనేకములు మన దేశమునందు కలవు. ఈ నియమమును మనుష్యుల విగ్రహముల వివిధాంగములను వ్రాయునప్పుడు మనపూర్వులు విశేష ముగ పాటించిరి. వివిధాంగముల కొలతలన్నియు నియ మింపబడెను. అజంతాచిత్తరువులం దీకొలత లన్నియు బాగుగ జూపబడెను.

3. భావము :

శ్లో. శరీరేంద్రియ వర్గస్య వికారాణాం విధాయకాః;
భావానుభావజనితా శ్చిత్తవృత్తయ ఈరితాః.

మనంబునగలభావములను ముఖమునజూడగలము. నవ్వునప్పుడు, ఏడ్చునప్పుడు, కోపముతోనున్నప్పుడు, ఆతు రతతో నున్నప్పుడు వదనమనేకరూపములను దాల్చును. వదనమే కాదు; దీనికితోడుగ ప్రతియంగముయొక్కస్థితియు

భావమువలన మారుచుండును. "యతో భావ స్తతో రసః." దీనిని మనము రవివర్మచిత్తరువులందు బాగుగజూడగలము. అజంతచిత్తరువులందీయంగము నేల లక్ష్యపెట్టలేదని ప్రశ్నింపవచ్చును. దేవునిపై లగ్నమైనహృదయమున నీభావములకంతగా చోటులేదు. శాంతియే ముఖ్యము. బుద్ధుని రూపమును జూడుము: ఇందు ఆనందము, దుఃఖము, కోపము మొదలగు మనోవికారము లెవ్వియు కానరావు. వీటిని త్యజించుటవలననే యాతడు నిర్వాణమును కాంచగలిగెను. ఆతని ప్రతియంగమునందును శాంతి మూర్తీభవించి యున్నది. ఇదియేకద వాంఛనీయము! ఇంతకు మించిన జ్ఞానఫలిత మింకొకటి లేదు. ఈభావప్రదర్శనము విశేషముగ లేకపోయినను అజంతచిత్తరువులందొకపవిత్రత కలదు. మతమునకు సంబంధించని చిత్తరువులలో కొన్నిటియందు మాత్రము భావము చక్కగ గనబడుటవలన నాటి చిత్రకారు లిందు ప్రవీణులైయుండియు ప్రదర్శించుట మానుకొనినటులు దోచును.

4. లావణ్యయోజనము: చిత్తరువు చూపరుల మనంబుల నాకర్షించవలెనన్న నది సుందరముగ నుండవలెను. సుందరమైన వస్తువులను జూడ నందరు నిచ్ఛగిం

తురు. కాని కాముకునకు యౌవనమున గాన్పించు సౌంద ర్యము, లోభికి బంగారమున గాన్పించు సౌందర్యము సౌందర్యము కానేరదు. అన్ని చిత్తరువులయందును సుందరమైన వస్తువులను వ్రాయుట యసంభవము. యౌ వనమునకుగల సౌందర్యము వార్ధక్యమున కుండదు. నెమలి కున్న సౌందర్యము కాకికి లేదు. కాని వార్ధక్యము నందు నొక సౌందర్యము కలదు. నెమలి జీవితమున నెట్టి సార్థకత కలదో, కాకి జీవితమునందును దానికి తగిన సౌందర్యము కలదు. రక్తము స్రవించుచున్న యుద్ధభూమి యందును నీతియు, ఆధ్యాత్మికలావణ్యము కలవు. ఇందును దేవుని యాజ్ఞ నిర్వహింపబడును. బుద్ధదేవుని శుష్కములైన యంగములందుగల యాంతరంగిక సౌంద ర్యము వారకాంత యంగములందు లేదు. బుద్ధుని యంగ ములనుండి వెలువడు తేజము, నిర్మలత, ముఖ్యములయి నవి. రామచంద్రుని కృష్ణవర్ణమునుండి వెలువడు నిజమగు క్షత్రియ తేజము లక్ష్మణుని శ్వేతవర్ణమున లేదు.

* శ్లో. ముక్తాఫలేషు ఛాయాయా స్తరళత్వ మివాంతరే,
ప్రతిభాతి యదంగేషు లావణ్యం తదిహోచ్యతే.

---

* కృష్ణాపత్రిక సంక్రాంతి సంచికనుండి.

ఇందు ముత్యముల గుండ్రతనము, వర్ణములకంటె వాటి నుండి వెలువడు తేజము ముఖ్యము. తెల్లని గాజుపూసల యం దిట్టితేజము లేదు. కాని యీ హైందవదృక్పథము నందు లావణ్యయోజనమన భౌతిక సౌందర్యము నిమిడి యుండకపోదు.

౫. సాదృశ్యము: సాదృశ్యమన సత్యము. విషయ మెట్టిదైనను, చిత్రకారుని రుచి యాధ్యాత్మిక మైనను, భౌతికమైనను చిత్తరువునందు సత్య మత్యంతావశ్యకము. ఇది లేని చిత్రము నిస్సారమైనది. తన మనోభావము లను స్ఫుటముగ వ్యత్యాసములేక ప్రదర్శింప జాలని శిల్పి నిజమగు శిల్పికాడు. చూపరులను తప్పుత్రోవను బెట్టుట చిత్రకళ యుద్దేశము కాదు. సృష్టియొక్క నిజమగు అర్థ మును ప్రదర్శించుట యూతని విధి.

౬. వర్ణికాభంగము: ఈ చిత్రవిద్యాంగము చిత్ర కారుడు తన రంగులను, కుంచెలను ఎటులుపయోగపరుప వలెనో చెప్పును. వీటి యుపయోగమునందు చిత్రకళా కోవిదుని ప్రవీణత కొంతవరకు దెల్లియును. ఇందును పాశ్చాత్య చిత్రకారునకును ప్రాగ్దేశపు చిత్రకారునకును భేదము కలదు. భారత చిత్రకారుడు రంగులను కొంత వరకు భావమున కనుగుణముగ జిత్రించును.

# ఒకటవ అధ్యాయము

మన దేశమున చిత్రలేఖము మిక్కిలి యున్నత స్థితియం దుండకపోయిన నిట్టి సూక్ష్మబుద్ధితో చిత్రకారుని కార్యక్రమమును విమర్శింపజాలక పోదురు. బౌద్ధులచే నిది శ్రద్ధాభక్తులతో నభ్యసింపబడెను. ఈకళ క్షీణదశకు వచ్చినకాలమున కళాభ్యాసకులు భావస్వాతంత్ర్యమును వీడి పూర్తిగ నీ నియమములపైననే యాధారపడియుండిరి. ఇట్టి నిబంధనలే చైనాయం దాదరింపబడుచుండెనని ఆరవశతాబ్దమున షియూహో (Hsieh Ho) వ్రాసెను. హిందూదేశపు షడంగములనే వీ రవలంబించినటులు గానవచ్చుచున్నది.

సనాతన హైందవచిత్ర విద్యానైక్యమును నిర్ధారణ చేయుటకు "చిత్రలక్షణ"మను గ్రంథము మరియొక యాధారము. ఈ గ్రంథము మతవిషయిక చిత్రలేఖనమును గూర్చి—ముఖ్యముగ పూజ మొదలగు ఆరాధనములం దుపయోగపడు దేవతల విగ్రహములనుగూర్చి—తెలియజేయును. కాని యిందొక ప్రకరణమున "ప్రమాణము"ను గూర్చి కలదు. మానవులయు, దేవతలయు ప్రతిమ లెటులుండవలెనో విపులముగ వ్రాయబడి యున్నది. ఈ గ్రంథమునుబట్టి మానవుని ముఖము సుందరముగ నుండవలెను. గుండ్రముగను, వంకరగను, త్రిభుజ

మువలెను ఉండకూడదు. ఇట్టి నిబంధనల ననుసరించి చిత్రించువారు వర్ధిల్లెదరు. ముక్తిని గోరు మానవుని ముఖము పొడవుగను, గుండ్రముగను, త్రిభుజమువలెను ఉండవచ్చును. నృపులయొక్కయు, దేవతలయొక్కయు శిరోజములు మృదువుగను, వలయములుగను, దివ్యమైన నీలిరంగు గలవిగను ఉండవలెను. స్త్రీల యాకృతి యెటులైన నుండవచ్చును కాని యంగములపొందిక మాత్రము ముఖ్యము. వారు వృద్ధులవలె వంగి యుండరాదు. సాధారణముగ యౌవనులవలె నుండుట మంచిది.

* శ్లో. ధ్యానయోగస్య సంసిద్ధౌ ప్రతిమా లక్షణం స్మృతమ్;
ప్రతిమాకారకో మర్త్యో యథా ధ్యానరతో భవేత్.

తథా నాన్యేన మార్గేణ ప్రత్యక్షేణాపి వా ఖలు;
దేవానాం ప్రతిబింబాని కుర్యాచ్ఛ్రేయస్కరాణిచ.

స్వర్గ్యాణి మానవాదీనా మస్వర్గ్యాణ్య శుభానిచ;
అపి శ్రేయస్కరం నృణాం దేవ బింబలక్షణమ్.
సలక్షణం మర్త్యబింబం నహి శ్రేయస్కరం సదా.

దేవతలరూపముల నెటులు వ్రాసినను శ్రేయస్కరమనియు, మానవుల రూపములను, సలక్షణముగ వ్రాసినను సదా శ్రేయస్కరముకాదనియు, శ్రీశుక్రాచార్యునియుద్దేశము.

---

* కృష్ణాపత్రిక సంక్రాంతిసంచికనుండి.

చిత్రలక్షణమునందు నృపులయొక్కయు, దేవతలయొక్కయు, "ప్రమాణము"ను గూర్చి యిటులుగలదు. దేవతల విగ్రహములకంటె రాజులవి చిన్నవిగను, రాజుల విగ్రహములకంటె తదితరులవి చిన్నవిగను ఉండవలెను. ఇదివరకు జెప్పినటులు స్థూలశరీరబలముకంటె ఆధ్యాత్మిక బలము ఎక్కువ యనియు, పూర్వజన్మమునందు జేసిన సుకృతమువలన రాజు లట్టి యున్నతజన్మము నందెదరనియు హిందువులు నమ్మెదరు. దేవగడ దేవాలయమున అనంతశయనుడగు విష్ణుని విగ్రహమునందును, అనేకములగు ఇతర శిల్పములందును ఈ ప్రమాణనియమము స్ఫుటముగ గాన్పించును. సాముద్రికశాస్త్రము ననుసరించి చిత్తరువులను వ్రాయవలెనని యొక ముఖ్యనియమ మున్నటులు గోచరించును. ఇవికాక గుప్తవంశపు రాజుల పాలనలో వ్రాయబడిన శిల్పశాస్త్రములందు శిల్పచిత్రలేఖనముల విషయమై యనేక నిబంధనలు కలవు. వీటి నిప్పటికిని హిందూదేశమున వాడుచున్నారు.

సనాతన హైందవ యువతులు మతమునందును, భాషలయందును మంచిప్రవేశమును గలిగియుండిరనుటకు నిదర్శనములు కలవు. చిత్రరేఖ చిత్రలేఖనమున ప్రవీణు

రాలసి మనపురాణముల నున్నది కాన స్త్రీలును చిత్ర విద్యయందు ప్రవేశము కలిగియుండిరని చెప్ప సాహసింప వచ్చును.

ప్రాచీన హైందవచిత్రకారుడు రాజపోషణపై ముఖ్యముగ నాధారపడియుండెను. దేశీయసోదరుల గౌరవమును పొందుచుండెను. రాజపండితులు, రాజపురోహితులువలె నీతడును రాజగృహము నాశ్రయించియుండుట సంభవము.

హైందవ చిత్రకారుడు తన మనంబునగల భావములను వెల్లడించు నుద్దేశముతో గళాప్రపంచమున మునిగియుండెను. తన చిత్తరువులందు నవీనులవలె తన పేరును వ్రాసుకొనలేదు కాన నాతనిగూర్చి విశేషముగ వ్రాయుటకు తగిన యాధారములు లేవు.

చాలవరకు మలినమై తొలిరూపము చెడియున్నను, ఇప్పుడు మనకు మిగిలియున్న చిత్తరువులను బట్టి యాకాలపు వర్ణికాభంగమును గూర్చి కొంత తెలిసికొనగలము. ప్రపంచమునం దన్ని దేశములందువలె భారతదేశమునందును నాగరికత శైశవమున నుండిన కాలమున మానవుడు తన చిత్తరువుల నెరుపురంగుతో వ్రాయుచుం

డెను. ఛాయను జూపవలసిన చోటుల నీవర్ణమునే కొంచెము నలుపురంగు కలిపి వ్రాయుచుండెను. ఈరంగు రాళ్లకును, గోడలకును అంటుకొనుట కిందు కొవ్వును గలిపి యుండవచ్చును. మోటుకుంచెలతో వర్ణలేపనమును జేసి, సన్నని పుడకలతో రేఖలను గీయుచుండినటులు గానవచ్చుచున్నది. జోగిమారా గుహాలందు గరుకుగ నున్న రాళ్లపైని, కొన్నిచోటుల పలుచగ బూయబడిన మంటిపైని చిత్తరువులు కలవు. ఇందు చిత్రములు ఎరుపు, తెల్లని సుద్ద, కరక్కాయలనలుపుతో చిత్రింపబడినవి. ఈ రంగులను నూరు శిలాఫలకము లిచ్చట లభించెనని యిదివరకు వ్రాసియుంటిని. ఇట్టి మోటుపరికరములతో చిత్తరువులను వ్రాయు మానవు డనాగరికుడై యుండవలెను. కాని యీ కాలమునాటి యితర దేశములవారికీ విద్యయందు భారతీయు డెంతమాత్రము వెనుక బడలేదని తక్కిన దేశముల చరిత్రలను జూచిన స్పష్టపడును.

---

# రెండవ అధ్యాయము

---

## బౌద్ధుల కాలము (క్రీ. త. 50-700)

అనేక కారణములవలన మలినమైన హిందూ మతమునుండి భారతీయుల నుద్ధరించుటకు బుద్ధుడు తన సంస్కరణములను వ్యాపింపజేసిననాటినుండియు పాపమును దహింపజేయు దావానల మనునటులు బౌద్ధమతము భారతభూమియం దంతటను వ్యాపించెను. అశోకుడు మొదలగు మహాచక్రవర్తుల యాదరణను బడసి యిది చైనా, జపాను మొదలగు దేశములకు వ్యాపించుటయే కాక యచ్చటి పురాతనమతముల నణగద్రొక్కి.. యాధిక్యమును వహించెను. ఈ మతము హైందవ సంఘమును శుద్ధిచేసి మహదాశయములతో నింపెను. హృదయము నిర్మలముగ నున్నప్పుడు మానవుడు పరోపకారము, జ్ఞానోపార్జనము మొదలగు సత్కార్యములందు ప్రసక్తుడగును కాన నాకాలమున జ్ఞాన మనేకవిధముల బెరిగెను. దీనితోపాటు లలితకళ లున్నతస్థితికి వచ్చుట

యొక వింత కాదు. నేపాలు, టిబెట్టు, బర్మా, సయాము, జావా, చైనా, జపాను, హిందూదేశములందు గల నిద ర్శనములవలన శిల్పము, చిత్రలేఖనము తక్కిన కళల కంటె ఎక్కువ యభివృద్ధిచెందినటులు కానవచ్చును. ఆ కాలమునాటి ప్రతిమలు, చిత్రములు విశేషము బౌద్ధు లకు సంబంధించిన వగుటజేసి బౌద్ధమత విజృంభణమే దీనికి కారణమగుట నిశ్చయము. బౌద్ధమత మెచ్చట యుండెనో యచ్చట కళావిశారదు లుండిరని తారానా థుడు పైనజెప్పిన యంశములను బలపరచుచు వ్రాసెను

నలువైపులనున్న దేశముల కిట్లు మార్గదర్శకమైన భారతభూమి విదేశీయులచే ఎక్కువ గౌరవింపబడుచుం డెను. ఈ నూతన మతమును స్వీకరించిన ప్రాక్పశ్చిమ దేశీయులు బుద్ధుని జన్మస్థానమును దర్శించి, వారి శిష్యు లవద్ద శిక్షనుపొంది జ్ఞానము నార్జించుటకు ప్రయాణ సౌ కర్యములు లేకపోయినను వ్యయప్రయాసల కోర్చి హిందూదేశమునకు వచ్చుచుండిరి. ఇట్టివారి సంఖ్య యల్పమగుటచే తమకు దైవసముడగు బుద్ధునివిషయమై, తాము స్వీకరించిన మతము విషయమై యెక్కువ తెలిసి కొనుట కాసించువారు. బౌద్ధమతగురువులను తమతమ

దేశములకు రప్పించి యాదరించుచుండిరి. తమ యున్నతాశయములకు కారకుడైన బుద్ధుని సందేశము నితరదేశముల వ్యాపింపజేయుటకు హిందూదేశపుమతగురువులు అశోకాది చక్రవర్తుల యాజ్ఞలకు బద్ధులయ్యు, తమంతట తాము విదేశములకు తరుచుగ బోవుచుండిరి. తమ భాషయైన తెలియని వారిమధ్య, మతప్రచారము జేయుట కష్టసాధ్యము కాన అన్ని భాషల వారికిని బోధపడు చిత్తరువులను విరివిగ నుపయోగించుచుండిరి. స్వదేశము నందు శిలాశాసనములను, గ్రంథములను చదువజాలని వారివిషయమై వారు చేయబూను బోధనలను, గౌతమ బుద్ధుని జీవితచరిత్రమును చిత్రరూపముగ బ్రదర్శించుచు ప్రజలను మెప్పించి తమ మతమున గలుపుకొనుచుండుట సంభవము. గుహాలయం దిప్పటికిని కానవచ్చు చిత్తరువులకును, టిబెట్టు నేపాలు దేశములందు దేవాలయపతాకముల మీద గల రూపములకును ఇదియే కారణముగ దోచుచున్నది. ఉన్నతాశయములను మనంబున కంటజేయజాలు చిత్తరువులు నాగరికులచే స్వీకరింపబడిన ప్రతి మతప్రచారమునందును ముఖ్యాధారములుగ నున్నవి. ఇట్టి యున్నతాశయజనకమగు నీకళ తన సౌందర్యము వలన నితరుల నాకర్షించి వారి హృదయముల నట్టి యూశ

యముల నంకురింపజేయును కాన నీమార్గమును బౌద్ధులును త్రొక్కిరనుట నిర్వివాదాంశము.

బౌద్ధుల మతముతో పాటు వారిచే నాదరింపబడిన చిత్రలేఖనమును ముఖ్యముగ హిందూదేశమున వర్ధిల్లెను. ఎచ్చటనైనను బౌద్ధసన్న్యాసుల యాశ్రమముకొరకు భవనములను నిర్మింపదలచినప్పుడా మతమును స్వీకరించి సన్న్యాసాశ్రమములందు మెలగు చిత్రకారు లచ్చటికి బోయి, యితరుల మేలుకొరకు తమవిద్యను గోడలపై బ్రదర్శించి తృప్తిజెందుచుండిరి. ఇందు నియుక్తులై యున్నంతవరకు భవనములను నిర్మించు వారితో కాలమును గడపుచు, వారు పెట్టు భిక్షపై నాధారపడియుండిరి. ద్రవ్యోపార్జనమునకుగాక యుత్సాహకారణమైన బౌద్ధమత సేవను జేయునుద్దేశముతో వీరు చిత్రించుచు వచ్చిరి కాన నీకాలపు చిత్తరువులందు నిజమగు కళారహస్యములు కానవచ్చును. దైవారాధనమునకు, స్వమత సేవకు మించిన యున్నతభావము లుండుట యరుదగుటచే మతముతో నంతగా జోక్యములేని తరువాతి భారతీయచిత్రములు వీటితో సరిపోలవు.

గోడలపై చిత్తరువులను వ్రాయుట మన దేశమున ననాదియైన యాచారమని తోచును. ఈకాలమున దేశ

పాలకులభవనము లీరీతిని చిత్రింపబడినటులు ప్రబల నిద ర్శనములు కలవు. ఇదివరకు జెప్పినటులు హైందవవాతా వరణ తీవ్రతవలనను, తురుష్కుల దండయాత్రలందలి సైనికుల దుర్మార్గమువలనను ఇట్టిభవనములు నశించుటచే వాటితో నమూల్యములగు చిత్తరువులును నశించెను. కాని గుహాలయందు జిత్రింపబడినవి మాత్రము కొన్ని మిగిలియుండుటచే అద్వితీయమైన బౌద్ధుల చిత్రలేఖన మునుగూర్చి మనకు కొంత తెలియుచున్నది. మలినమై సగము నశించిన అజంతా గుహాలందును, సింహళమున గల సీగిరియా యందునుగల చిత్రములు చూపరుల నద్భు తరసనిమగ్నులుగ జేయుచున్నవి. సయాము దేశమున ఆంకోరునందు చిత్రశాలల చిహ్నములు కానవచ్చుచు న్నవి. క్రీ. త. ౪౦౦ వ సంవత్సరమునను, ౬౨౯-౬౪౫ సంవత్సరముల మధ్యను భారత దేశమున సంచారముచేసిన ఫాహియాన్, హుఎన్త్సాంగు అను చైనాయాత్రికు లిచ్చటి నిర్మాణములను, వాటిమీద గానవచ్చిన చిత్తరు వులను జూచి యాశ్చర్యపడిరి. బుద్ధుడు శ్వేతహస్తిపై నా రోహించి తనతల్లియగు మాయాదేవి గర్భమున ప్రవే శించుచున్నటు లొకచిత్తరువు కపిల వస్తుపురమున నుం డెనని ఫాహియాను వ్రాసెను. ఇప్పుడు బహుశః పంజా

బని పిలువబడుచున్న భాగమున కాబోలు ఉండిన యొక
యాత్రమముయొక్క గోడలు, తలుపులు, కిటికీలు సుంద
రముగ జిత్రింపబడి యుండెనని హుఅన్ త్సాంగు వ్రా
సెను. క్రీస్తుకు పూర్వము నాల్గవ శతాబ్దమున పాళీభాష
యందు వ్రాయబడిన బౌద్ధుల "వినయపిటక"మను గ్రంథ
మందు పాసెనాడ నృపుని చిత్రగృహము పెక్కు చిత్తరు
వులతో నలంకరింపబడెనని కలదు. దుత్తగామినియను
నృపునిచే నిర్మింపబడిన డగోబా చిత్తరువులచే నలంకరింప
బడెనని యైదవ శతాబ్దమున వ్రాయబడిన "మహావంశ"
మను గ్రంథమున గలదు. వీటిని జూడ నాకాలమున చిత్ర
లేఖనము సర్వసాధారణముగ నుండియుండె ననుట
నిశ్చయము.

విదేశములందు గానవచ్చు చిత్తరువులను జూతము.
క్రీ. శ. ౬౭-వ సంవత్సరమున మింగుటాయి అను చైనా
చక్రవర్తియొక్క యనుజ్ఞవలన కశ్యపదుంగ యను నొక
బౌద్ధ సన్యాసి ప్రాగ్దేశములకు కొన్ని చిత్తరువులతో
బ్రయాణము చేసెనని కలదు. అప్పటినుండి యేడవశతా
బ్దమువరకు నిట్టి యాత్రికులు చైనా, జపాను దేశములకు
బోయి యచ్చట సుప్రసిద్ధ చిత్రములను చిత్రించినటులు
కానవచ్చును. జపానునందు "నార" కాలము (ఏడవ శతా

బ్దమున) చిత్రింపబడిన వాటియందు అజంత మొదలగు హైందవ చిత్రలేఖన విధానముల చిహ్నములు కానవచ్చుచున్నవని డిల్లనుగారి యభిప్రాయము. క్రీ. త. ౭౦౮-౭౧౫ సంవత్సరములమధ్యను జపానునందు నిర్మింపబడిన 'హారుయుజి' దేవాలయమున గల సుప్రసిద్ధ చిత్రము అజంత చిత్తరువులవలె నున్నదని బినియనుగారు చెప్పుచున్నారు. ఈ కాలమునకు సంబంధించక పోయినను పదునైదవ శతాబ్దమున ప్రబలిన జపానునందలి "టోసా" విధానములు కాలపరిమితివలన మార్పుచెందిన హైందవ విధానములే యనియు, బౌద్ధుల కివి సంబంధించినవనియు రిక్కెట్సుగారు వ్రాసిరి. చిత్రలేఖనము నభ్యసించుటకు ప్రత్యేకము కొందరు విదేశీయులు హిందూదేశమునకు వచ్చినటులు కానవచ్చుచున్నది. ఇచ్చటినుండి అచ్చటకు వెళ్లినవారివద్ద నభ్యసించుటకంటె మార్గదర్శకమైన యీ కళయొక్క జన్మస్థానముననే శిక్షబొందుట శ్రేష్ఠము కాన నిది మిగుల సంభవము.

బౌద్ధమత మెంతగొప్పదయినను, చిత్రలేఖనమును బౌద్ధసన్యాసు లెంత యాదరించినను, దేశమునందు శాంతిలేనిది నలువైపుల నిట్టి జ్ఞానాభివృద్ధి కలుగనేరదు.

నాల్గవ శతాబ్ది ప్రారంభమున గుప్తుల రాజ్యముతో దేశమున శాంతియు స్థాపిత మయ్యెను. దక్షిణమున ఆంధ్ర రాజుల పతనమువలనను, ఉత్తరమున కుషనుల నాశనము వలనను కలిగిన సంక్షోభమునందు సంఘు మనేకములగు మార్పులను జెంది యా యెడతెగని యరాజకము లెన్న డంత మొందునాయని వేచియుండెను. గుప్తులకాలమున—ముఖ్యముగ విక్రమాదిత్యుని పరిపాలనమున—నదివరకు నణగియుండిన సంఘుశక్తులు ప్రజ్వరిల్లి యనేకవిధముల సత్కార్యరూపమున మరల అవతరించినవి. ఈ చక్రవర్తి కాలమునను, తరువాతి గుప్తులకాలమునను వాఙ్మయము, శాస్త్రములు, కళలు దేశమునందంతటను అభివృద్ధి జెందినవి. కాళిదాసాదిమహాకవు లీకాలమునే యలంకరించిరని పండితులు నిర్ణయించిరి. నాటకరచన నూతన మార్గములను వెదకెను. నాణెములు, శిల్పములు క్రొత్తరూపములతో దేశీయుల నానందపరచెను. పేరుపొందిన కొన్ని అజంత, బాగ్, సీగిరియ చిత్తరువు లీకాలముననే చిత్రింపబడినవి.

కాని పరిస్థితు లొక్కరీతి నుండజాలవు. గుప్తుల రాజ్యము పరులచేతులలో పడెను. బౌద్ధమతస్థులయందు మహాయానము, హీనయానము అను రెండు తెగ లేర్పడి

కలహములు పెరుగుటవలన హిందూమతము కొన్ని మార్పులతో మరల ప్రచారమునకు వచ్చెను. బౌద్ధ మతమునెడల ప్రజలకు విశ్వాసము తగ్గుటవలన చిత్రలేఖ నావశ్యకత యంతగా లేకపోయెను. పూర్వమువలె చిత్ర కారునకు పనిలేకపోవుటచే నాతడు తన పరికరములను విడచిపెట్టి వేరు పనులయందు నియుక్తుడయ్యెను. అచ్చ టచ్చట కానవచ్చుచుండెడి చిత్తరువులు మహమ్మదీయుల దండయాత్రలయందును, విగ్రహారాధనమునెడల సాను భూతిలేనివారి యాధిపత్యముక్రిందను, ఇతర మతవైష మ్యములందును నశించెను. 'గ్రుడ్డిలో మెల్ల' యనునటులు రాజ్యకాంక్షవలన గలిగిన యీ యల్లరులందు రాజులు, సైనికులు అజంతాది గుహలను మరచిరి. ఒకానొక సమ యమున నృపులచేతను, ప్రజలచేతను ఆదరింపబడి యిం చుమించుగ ప్రతిపట్టణపు గోడలమీదను కానవచ్చిన చిత్తరువుల యాధిక్యమును బాగడుటకిట్లు మిగిలినవే మన కాధారము లయ్యెను.

తారానాథుడు హైందవచిత్రలేఖనమును బొగ డుచు దాని చరిత్రను కొంతవరకు వ్రాసెను. ఇది విశ్వా సార్హమైనను కాకపోయినను ఇందు కొన్ని ముఖ్యము

లైన యంశములు కలవు. ఈతడు దేవతలు, యక్షులు, నాగులు చిత్రకారులని వ్రాసెను. "దేవతల"చే వ్రాయబడిన చిత్తరువులు చూపరులకు సజీవములా యని భ్రమింపజేయగలవని వినయాగమమున గలదట. యక్షులు మానవులైనను, దేవతలైనను వీరి చిత్తరువు లద్భుతములై యుండెనట. మూడవ శతాబ్దమున నుండిన నాగార్జునునిక్రింద ఉత్తర హిందుస్థానమంతటను వ్యాపించి యుండిన నాగులు సుప్రసిద్ధచిత్రకారులు. శిల్పమునందును వీరు ప్రవీణులై యుండినటులు అమరావతి స్తూపమువలన తెలియవచ్చుచున్నది.

మూడవ శతాబ్దమునకు పిమ్మట ఈ కళ క్షీణదశకు వచ్చినటులును, తర్వాత మరల (గుప్తుల రాజ్యమునందై యుండవలెను) అభివృద్ధి జెంది మూడుభాగములుగ నేర్పడెననియు తారానాథుడు వ్రాసెను. ఐదు, లేక ఆరు శతాబ్దములందు రాజ్యముచేసిన బుధపక్షుని కాలమున మగధదేశీయుడగు బింబిసారునిచే "మధ్యదేశము"న (సంయుక్తపరగణాలు) చిత్రలేఖన మభివృద్ధి పరుపబడెనట. ఈకాలమున నెక్కువగ చిత్రకారు లుండిరనియు, వీరి చిత్తరువులు పూర్వము "దేవతల"చే చిత్రింపబడిన

వాటివలె నుండెననియు గలదు. ఉదయపురమున నేడవ శతాబ్దపు మధ్యమున పాలించిన మేవారు శిలాదిత్యగుహిలుని (సిలాన్నృపుడని తారానాథుడు వ్రాసెను) కాలమున శృంగధరుని యాధిపత్యముక్రింద యక్షుల చిత్తరువుల వంటివి పశ్చిమము (రాజపుత్రస్థానము)న చిత్రింపబడెను. తొమ్మిదవ శతాబ్దమున రాజ్యముచేసిన ధర్మపాలదేవ పాలుర కాలమున ధీమనునిచే వరేంద్రము (వంగదేశము)న చిత్రలేఖన మభ్యసింపబడెను. పిమ్మట బీహారు ఉత్కళములందు ధీమనుని కుమారుడగు 'బిటపాళో' అనువానిచేత నాగుల కళావిధానముల ననుసరించియు, హర్ష శిలాదిత్యునికాలమునను, తరువాతి నృపులకాలమునను నేపాళమున యక్షనాగుల విధానముల ననుసరించియు, ఎనిమిదవ శతాబ్దమున లలితాదిత్యుని రాజ్యమునందు యక్షుల విధానము ననుసరించియు, పదునొకటవ శతాబ్దమున హంసరాజనుమంత్రికాలమునను, కాశ్మీరమునను చిత్రలేఖన మభ్యసింపబడెనని తారానాథుడు వ్రాసిన చరిత్రయందు గలదు. అజంత, బాఘులందుగల చిత్తరువుల బట్టి యీ చరిత్రయందు కొన్నితప్పు లున్నటులు గానవచ్చినను యిం దధికాంశము నిజమని పండితు లభిప్రాయపడుచున్నారు.

రెండవ అధ్యాయము

బౌద్ధుల చిత్తరువులందలి హస్తముద్ర మనోహరముగ నున్నది. దైవపూజయం దిప్పటికి నీముద్ర మన దైనికకార్యములం దెట్టి ప్రాముఖ్యము వహించెనో చూడగలము. నిర్జీవములగు నీచిత్రములు తమభావములను వాక్కుద్వారా కాక వ్రేళ్లద్వారా చూపరులకు జెప్పునటులుండును. ప్రతివ్రేలియందును జీవమున్నటులుండును. చేతులు ముడుచుకొనుట, వ్రేళ్లను అనేక విధములుగ వంచుట, మణికట్టుయొక్క సుందరమైన వంపు, వీటన్నిటికిని అర్థము కలదు. తెలియబరుచు భావ మేదియు లేనప్పుడు పాత్రయో, వింజామరయో, పుష్పమో హస్తము నలంకరించియుండును. ఇట్టిసమయములందు కూడ నీహస్తముల సౌందర్య మద్వితీయము. చిత్రకారున కిందుగల ప్రవీణత ముఖ్యముగ మృదంగము మొదలగు వాటిని వాయించుచున్నటులు చిత్రించినప్పుడు—చూడదగును. కోమలములును, సుందరములు నైన వేళ్ల తాకుడు మాత్రమున నాయంత్రములు వింతస్వరములతో సజీవములైనటులు నాతడు చిత్రింపగలిగెను. తక్కినవిషయములటుండ ~~ఈ~~యొక్క ప్రవీణతకు మాత్రము హైందవ చిత్రకారుడు మిగుల గౌరవార్హుడు.

ఇప్పటికిని హిందూదేశమున గోడలమీద చిత్తరువులను వ్రాయుట యాచారమై యున్నది. సున్నమెండిన పిమ్మట రంగులను పూసినయెడల సూర్యుని వేడిమికది పొక్కి రాలిపోవును. కాన, యిసుక సున్నము గలిపి పూసినపిమ్మట నది యారకమునుపే దానిపై రంగులను బూయుదురు. చిత్రమంతయు నొకటి రెండుదినములలో పూర్తికానియెడల నది పూర్తియగువరకు జాగరూకతతో సాయంకాలమున దానిపై నీటిని జల్లి మరుచటిదినమున రంగులు పూయుటకు సిద్ధముగ నుంచెదరు. పూసిన సున్నము నునుపుగ నున్నయెడల చిత్తరువు విశేషకాలముండజాలదు కాన నొక కఱ్ఱచెక్కతో దానిని గరుకుగ జేసెదరు.

దీనికిని అజంతవిధానమునకును భేదము కలదు. ఈగుహాలందు సున్నమునకు బదులు జిగటమన్ను, పేడ, రాతిగుండ కలపి రాతిపై మెత్తిరి. ఇచ్చటి రాళ్లయందు చిన్నకన్నము లుండుటచే నిది వాటి కంటుకొని యిప్పటికిని రాలక యున్నది. కొన్నిచోటుల మంటిలో ఊకను కలపినట్లులు కానవచ్చును. సీగిరియ యందు ఇంచుమించుగ నిట్టి వస్తువులతోనే చిత్రించుటకు స్థలమును సిద్ధపరచిరి. ఈ

మెత్తుదను సుమారు అంగుళమున పరకవంతునుండిముప్పాతిక వంతువరకు దళసరిగ గలదు. సీగిరియయందు పాతిక అంగుళమునుండి యరయంగుళమువరకు గలదు. అజంతయందలి తొమ్మిదవగుహాయందు చాలపలుచగ, నునుపుగ నున్నది. రసాయనాది శాస్త్రపరిజ్ఞాన మిప్పుడు విశేషముగనున్నను ఇంతటి పటుత్వముకల పదార్థము వేరులేదని పండితు లభిప్రాయ పడుచున్నారు. చిత్తరువులను గీసిపై వ్రాయక ముందు పలుచగ సున్నమును బూసినటుల కానవచ్చును.

తొలుత చిత్తరువుయొక్క రూపును ఎరుపురంగుతో గీసి యేర్పరచుచుండిరి. గీనియందు మార్పులను చేయవలసి వచ్చినయెడల నలుపుతో కాని, మట్టిరంగుతో కాని దిద్దుటకలదు. పిమ్మట నీ రేఖలు కనబడునటులు పలుచని యాకుపచ్చరంగును పూసిరి. ఇది యారిన పిమ్మట కావలసిన వర్ణలేపనమును జేసి, మరల మట్టిరంగుతోను, నలుపుతోను తొలిరేఖమీద దిద్దుచుండిరి. ఈ చిత్రకారుల గురువు వాటిని బరీక్షించి యచ్చటచ్చట సవరించినటులు గొన్ని చిత్రములందు కానవచ్చును.

సున్నముపైని పూసినయెడల కొన్ని రంగులమాపు చెడును కాన హైందవ చిత్రకారు డన్నివర్ణముల నుప

యోగింపజాలక పోయెను. ఈత డుపయోగించిన రంగు లించుమించుగ నన్నియు ప్రకృతియందు లభించునవిగ కానవచ్చుచున్నవి. అజంత, బాఘులందు తెలుపు, ఎరుపు, మట్టిరంగు, నలుపుకలిసిన ఆకుపచ్చ,నీలి మొదలయినయనేకవిధములగురంగులు పూయబడెను. రామగడపర్వతపుచిత్తరువులందు, సీగిరియయందు నీలిరంగు కానరాదు. సింహళమునందలి .అనురాధపురమున విశేషముగ నుపయోగపరుపబడిన పసుపుపచ్చ అజంత గుహాలం దచ్చటచ్చట మాత్రము వినియోగమునకు దేబడెను. సున్నమువలన సాధారణముగ నాశనమగు ఊదా, గులాబి, ఆకుపచ్చ మొదలగు వర్ణము లెచ్చటను కానరావు. వీటిని హైందవ చిత్రకారు డుపయోగపరుపలేదో, లేక ఇటీవల నివి నశించి పోయినవో నిర్ణయించుట దుస్సాధ్యము.

ప్రాచీన హైందవచిత్రకారుని కుంచెలు మొదలగు పరికరములను గూర్చి తెలియుట లేదు.

---

# మూడవ అధ్యాయము

---

## అజంత గుహాలు

ప్రాపంచిక సుఖములను త్యజించి, సన్న్యాసాశ్రమము గొన్నవారందరు కాంతాకనకాది బంధనములందు చిక్కుకొనియున్నవారి సంపర్కము లేకుండ నవిఘ్నముగ దైవస్మరణము జేయుట కేకాంతస్థలమునకు బోవుట ముఖ్యముగ హిందూదేశమున ననాది నుండియు ఆచారమై యున్నది. మతప్రచారమునకై దేశమునందంతటను సంచారము చేయుచుండినను, జనసంకులమైన స్థలములందు, అనేకవృత్తులవారి మధ్యను మెలగుచుండినను, బౌద్ధసన్న్యాసులు గుహాలయందు నివసించు చుండిరి. బౌద్ధమత ప్రాముఖ్యము పెరిగినకొలది ఈ గుహాలు సుప్రసిద్ధములైన యాశ్రమములుగ మారెను. అచ్చటికి వచ్చుచుండిన పామరుల దృష్టి నాకర్షించి బౌద్ధమతమునం దభిరుచి కలుగజేయుటకును, అంతకు పూర్వమే బౌద్ధ

మతమును స్వీకరించిన వారి దృక్పథమున మతస్థాపకుడగు బుద్ధుడు నిలిచియుండునట్లు చేయుటకును ఈగుహ లలంకరింపబడినటులు గానవచ్చును. వెనుక జెప్పినటులు బౌద్ధమతావలంబకులగు కళావిశారదులు తమ హృదయముల నాటిన భక్తిని చిత్రరూపముగ వ్యక్తపరచి ధన్యులైరి. ఇంతటి యుత్సాహవంతుల నొకే మార్గమున నడుపుట దుర్లభము. వారిని నియమించిన వారి యుద్దేశము లెటులున్నను, మతముయొక్క కట్టుబాట్లెంత కఠినముగ నున్నను, ఉన్నతాదర్శములతో గూడిన కళ యనేక విధముల వ్యాపింపక మానదు. నృపుల చరిత్రలు, యువతీయువకుల విలాసములు, బుద్ధుని జీవితచరిత్ర, జంతువులు, వేయేల, చిత్రకారునకు గానవచ్చిన యన్ని దృశ్యములు అజంత గుహాకుడ్యముల మీద నుండుట కిదియే కారణము.

నైజాము రాష్ట్రమునందలి ఫరీద్‌పురమునకు మూడున్నరమైళ్లు దూరమునను, అజంతయను గ్రామమునకు నాలుగుమైళ్ల దూరమునను, ఇంధ్యాద్రిపర్వతములయొక్క కనుమద్వారమునను అజంతగుహలు కలవు. సుమారు 250 అడుగుల యెత్తుకల అర్ధవలయాకారముగ నున్న పర్వతశిఖరమునం దిరువది తొమ్మిది గుహలు

ధోలువబడెను. ఈ గుహాలన్నియు తూర్పునుండి పశ్చిమమునకు 600 గజముల పొడవున వ్యాపించియున్నవి.

వీటివద్ద నిలువబడి నలువైపులజూచిన నాప్రదేశము బుద్ధదేవుని గుణకీర్తనము జేయుచు ఉన్నతావేశము గలిగినట్టియు, ప్రకృతి సౌందర్యమున సృష్టికర్తయొక్క గొప్పతనమును గ్రహింపగలిగినట్టియు బౌద్ధసన్న్యాసులకు దగిన యాశ్రమమని మనంబునకు దట్టును. దగ్గరనేయున్న అస్సైయుద్ధభూమిని స్మరించి, గుహాలవైపు జూచిన నాభూమి పవిత్రమైనదనియు, ఎంతటిగొప్ప సంస్థలైనను కాలపరిమితిని నశించుననియు, మానవుడు మహాకార్యములను జేయజాలినను అజేయుడు కాడనియు దోచును. హైందవ నాగరకతయొక్క ఘనతనెల్లెడల వెదచల్లు అజంతగుహాలప్రాంతమున హైందవ పరాభవమును జాటు అస్సై రణరంగముండుట జ్ఞప్తియందుంచుకొనవలసిన విషయము. పచ్చని బీడులు కొండ్ల నానందపరుప మధ్యమధ్యను పర్వతశిఖరముల శిలలు "ఆనందమున దుఃఖముకల"దని స్ఫురింపజేయుచుండును. దిగువను జలప్రవాహము సుఖదుఃఖములందు జీవయాత్రవలె వంకరగ గానవచ్చును.

సాధారణముగ "గుహ"లని పేర్కొనబడుచున్న యిరువది తొమ్మిది అజంతనిర్మాణములందు 9,10,19,26 సంఖ్యలచే పిలువబడుచున్నవి. చైత్యగృహములు. కొన్ని పూర్తిగ నిర్మింపబడినవి కావు. ఇవన్నియు నిర్మాణము నందు సుందరముగ నున్నను, వీటియందు గల చిత్తరువులే ముఖ్యముగ గణింపదగినవి. 1,2,4,6,9,10,11,15,16, 17,19,20,21,22,26 సంఖ్యల గుహలందు చిత్తరువు లుండి నటులు నిదర్శనములు కలవు. ఇప్పుడు 1,2,9,10,11,16, 17,19,21 గుహలు మాత్రము సచిత్రములుగ నున్నవి. 18,22,23 గుహలందు చిత్తరువుల చిహ్నములు కొంచె మైనను లేవు. ఇవి తక్కినవాటికన్న ముందు, అనగా సుమారు క్రీ. పూ. రెండవ శతాబ్దమున, నిర్మింపబడినవి.

వందలకొలది సంవత్సరము లివి సాంద్రారణ్యము లందు మరుగుపడియుండెను. హైందవ పండితులు వీటిని జూచియుండినను, ఏ గ్రంథమునందైనను పేర్కొనలేదు. ప్రథమమున 1819 సంవత్సరమున ఐరోపీయుల కివి కాన వచ్చెను; కాని వాటి గొప్పతనమును వారును గ్రహింప జాలకపోయిరి. శిల్పచరిత్ర పండితులగు జేమ్సుఫెర్గుస్సన్ గారు 1843 వ సంవత్సరమున నీచిత్తరువులనుగూర్చి

ప్రచురించి, వాటి ప్రతులను కాగితములపై వ్రాయింపవలె నని ఈస్టు ఇండియా కంపెనీ యధికారులను బలవంత పెట్టిరి. కొన్నిసంవత్సరములు కడచిన పిమ్మట ఈ యధి కారుల యుత్తరువుల ప్రకారము మేజరు గిల్లుగారు 1857 న సంభవించిన సిపాయీల తిరుగుబాటువరకు శ్రమపడి సుమారు ముప్పది చిత్తరువులను వ్రాయగలిగిరి. వీటియం దైదుతప్ప తక్కినవన్నియు సీమలో క్రిస్టలు భవ నము (Crystal Palace) కాలిపోయినప్పుడు నశించెను. కాని యిటులు పాడైన చిత్తరువుల నమూనాలు 1856 న స్పియర్ దొరసానిగారును, 1869 న ఆమెయే మారుపేరు తోను, 1879 న డాక్టరు బర్గెస్సుగారును వ్రాసిన గ్రంథము లందు కానవచ్చుచున్నవి. అటుపిమ్మట 1872-1885 సం వత్సరముల మధ్యను బొంబాయి చిత్రకళాశాలాధికారిగ నుండిన గ్రిఫిత్సుగారును, వారి శిష్యులును అజంతచిత్తరు వుల ప్రతులను చిత్రించి, కొన్నిటిని రెండు చక్కని గ్రంథ ములందు ప్రచురించిరి. ఈకాలమునం దీ పండితులు మేలుతో కొంత కీడునుకూడ చేసినటులు కానవచ్చును. చిత్తరువులు నీటిచే చెడకయుండుటకు గిల్లుగారో, గ్రిఫిత్సు గారో వీటిపైని వార్నిషు పూయుటచే అది యిప్పుడు

మాసి, పసుపువర్ణముగ మారి, వాటిరూపునంతను చెడిపె నని హెర్రింగాము దొరసానిగారు వ్రాసిరి. ఇటీవలను దక్షిణ కెన్సింగ్టను ప్రదర్శనశాల(South Kensington Museum) కాలుటవలన గ్రిఫిత్తుగారు తమ రెండవ గ్రంథ సూచికయందు పేర్కొనిన వాటిలో కొన్నిపటములు నశించెను. మిగిలిన సుమారు నూరు చిత్తరువులును రంగు లు వాడుటచే చెడియున్నవి. ఈ అజంతచిత్తరువుల నాశన మునకు కారకులు నైజాము ప్రభుత్వమువారు. వీటిని సంరక్షించుటకు తొలుత వీరు విశేషముగ శ్రద్ధ వహించ లేదు. గుహాలపై అధికారులుగ నియమింపబడినవారు వాటిని చూడవచ్చిన కళాభిమానులగు యాత్రికుల నానందపరచుటకు చిత్తరువులందలి వ్యక్తుల శిరస్సులను సున్నముతోగూడ బిళ్లలుగగోసి బహుమతులుగ నర్పింప సాగిరి. బొంబాయియందలి ప్రదర్శనమందిరము కొరకు డాక్టరు బర్డ్గారు నిటులే చేసిరి. సహజముగ నిట్టి బిళ్ల లన్నియు కొలది కాలమునకు చితికి ముక్కలైపోయినవి. నరసంచారము విశేషముగ లేనప్పుడచ్చట చేరిన గబ్బిల ములు, పక్షులు, గూడులనుకట్టు పురుగులు మొదలగు వాటివలనను, వీటిఘనత నెరుగని యాత్రికులు గోడలపై

వ్రాయుటవలనను, సన్న్యాసుల యగ్నిహోత్రముల పొగ వలనను వీటిరూపు చాలవరకు చెడెను. 1819 వ సంవత్సరమున నుండిన చిత్తరువులలో కొన్ని 1879 న కానరాలేదు. 1879 న బర్గెస్సుగారు పేర్కొనిన విప్పుడు కానవచ్చుటలేదు.

1903-04 సంవత్సరమున నీగోడలను శుభ్రపరచి వాటిముందు తీగెలతో జేసిన తెరల సమర్చిరి. నైజాము వారిప్పుడు కొంతధనమును వెచ్చించి, చిత్తరువులను కాపాడుచున్నారు. ఈ ప్రయత్నముల వలననైన నికముందీ యమూల్యములగు చిత్తరువులు చెడకయుండునను నాశ కలదు. ఇప్పు డారుగుహలందున్న చిత్తరువులబట్టి తక్కిన గృహములం దుండినవాటి సౌందర్యమును కొంతవర కూహింపనగును. ఒక్కొక్కగుహ అరువది యడుగుల చదరమగుటచే పైని జెప్పిన కారణములవలన నెన్ని యమూల్యములగు చిత్తరువులు చెడెనో యని విచారము కలుగును. గోడలేకాక మీదికప్పును, స్తంభములును గూడ చిత్తరువులచే నిండియుండినవి.



అజంతలో నొక గుహ లోపలిభాగము

ఈ గుహలన్నియు నేకకాలమున దొలిచినవి కావ నియు, గుహల శిల్పములు, చిత్తరువులు నొకకాలముననే పుట్టినవి కావనియు పండితులు నిర్ణయించిరి. చిత్తరువు లన్నియు నొకే చిత్రకారునిచే వ్రాయబడుట యసంభ వము. అనేకులచే చిత్రింపబడి, విధానములందు భేదము కలిగియుండుటచే అనేకశతాబ్దములం దప్పుడప్పు డివి చిత్రింపబడియుండు ననుట నిశ్చయము. ఏయే చిత్రకారు డేయే చిత్తరువులను వ్రాసెనో తెలియరాదు. కాని,

9,10 గుహల చిత్తరువులు క్రీ. త. మొదటి శతా బ్దమునను,

10 వ గుహయందలి స్తంభములమీాద నున్నవి బహుశః క్రీ.త. 350 సంవత్సరమునందో, లేక తరువాతనో,

16,17 గుహలం దున్నవి సుమారు క్రీ. త. 500 సం.నను,

1,2 గుహలందు గలవి క్రీ. త. 626-628 సంవ త్సరములను,

చిత్రింపబడెనని చెప్పవచ్చును.

అలంకారార్థము చిత్రింపబడిన కొన్నియు, అప్పటి చరిత్ర, ఘనకార్యములను తెలియజేయు కొన్నియు తప్ప

తక్కిన చిత్తరువులన్నియు బౌద్ధమతమునకు జెందినవి. బుద్ధుని జీవితమును, బుద్ధుని రూపమును తెలియజేయుననే కాక, బుద్ధుని పూర్వజన్మములను గూర్చి చెప్పు జాతక కథల నాధారముగ దీసుకొని వ్రాయబడినవి అధికాంశము కలవు. అప్పటి ప్రజలయందు ప్రచారము నొందియుండిన కథ లించుమించుగ నన్నియు నీ చిత్రములవలన మనకు దెలియును. ఇవికాక అవలోకితేశ్వరునియొక్కయు, జీవిత చక్రములయొక్కయు, సింహళమున విజయుడు ప్రవేశించు చరిత్రయొక్కయు చిత్తరువులు మనకు కానవచ్చును

పాంపేయందు తప్ప ఇన్ని పురాతన చిత్తరువు లొక్కచోట ప్రపంచమునందెచ్చటను లేవట. భావము యొక్క గభీరత, వైశాల్యము, చిత్రరచనయొక్క పొందిక, రేఖల లావణ్యము వీటి కీర్తికి ముఖ్యకారణములు. కొన్ని చిత్తరువులు ప్రకృతి సహజ పరిమాణములను గలిగి యున్నను, అధికభాగము సగము కొలతతో నున్నవి. హైందవ సంప్రదాయముల రీతిని ముఖ్యవిగ్రహములు మాత్రము తక్కిన వాటికంటె పెద్దవిగ నున్నవి. చిత్రము యొక్క యుద్దేశము చూపరులకు వెంటనే గోచరమగుట

చిత్రరచనయందు చాల ముఖ్యము. రాధాకృష్ణుల లీలాభి వర్ణనమందు ప్రక్కనున్న గోవు, పుష్పవృక్షములు, సరస్సు మొదలగు నవన్నియు ముఖ్యవిగ్రహములగు రాధాకృష్ణుల ప్రాముఖ్యమునకు తోడ్పడవలెను కాని, వాటిని మించియుండరాదు. ఇట్టి కేంద్రీకరణనైపుణ్యము అజంత చిత్తరువుల యలంకారము. ఉన్నతభావము లతి విపులముగ వీటియందు ప్రదర్శితములగుట వలన నీచిత్తరువులు కళారాధకులను బలవంతముగనో యనునటులు సమున్నత భావసోపానములకు లేవనెత్తును. ఇట్టి సుగుణములతో నిన్నిచిత్తరువు లొకచోట నుండుటనుబట్టి అజంత గుహాలు భూలోకస్వర్గమువలె నుండునని యొకపండితుడు వ్రాసెను. ఇది యుత్ప్రేక్షయైనను చూపరులకట్టి యుత్సాహము, ఆనందము కలుగుట సహజము.

హైందవ చిత్రలేఖనమునందు రేఖలే ప్రధానమని యిదివరకు చెప్పియుంటిని. ఈ రేఖారచనకు అజంత పుట్టినిల్లు. అంగపుష్టి, వెలుతురు చాయలు, వస్తువులస్థితి రేఖలతోనే వ్యక్తపరుపబడెను. సనాతన గ్రీకుచిత్రములందు రేఖలు ప్రాముఖ్యమువహించినను అజంత చిత్తరువులందుగల రేఖావిన్యాసముతో నేవిధమునను సరిపోలవు.

మీఁదఁజెప్పిన కారణములవలన అజంతచిత్తరువుల రంగులు చాలవరకు మాసి చిత్రపుష్టిని తెలుపు లేత చాయలను, వర్ణములు వేరువేరుచోటుల వ్యత్యాసముతో చిత్రించుటవలన గలిగిన విస్పష్టతను, వీటియన్నిటివలన గలుగు సౌందర్యమును అధికాంశము గోలుపోయినవి. తీవ్రతను విడనాడిన వర్ణములు-ముఖ్యముగ నలుపు-మాత్ర మిప్పుడు మిగిలినవి. ఒకానొకసమయమున నీచిత్త రువులు గాఢమైనట్టియు, తేజోవంతమైనట్టియు నీలి యాకు పచ్చలతోను, వాటివద్దనే వ్యతిరేకభావమున దోచు ఊదా మట్టిరంగులతోను విరాజిల్లుచుండెను. రంగుల సౌందర్యము నధికపరచునటులు మిక్కిలి ప్రవేశము కల చేతితో దృఢముగ వ్రాయబడిన రేఖలు విరాజిల్లుచుం డెను. అజంత చిత్రరచనయెడల సానుభూతికల సుప్రసి ద్ధచిత్రకారు లీచిత్రములు వేయిసంవత్సరములక్రింద నెటు లుండెనో యటులూహించి వ్రాసిన అజంత గుహాల మహిమ లోకమునకు పూర్తిగ వెల్లడికాఁగలదు.

తొమ్మిదవ గుహాయందలి చిత్తరువులందు తప్ప ఇంచుమించుగ నన్ని చిత్రములందును గాఢమైన వర్ణముల (సాధారణముగ నలుపునకు సంబంధించిన రంగుల) మధ్య

లేతరంగులతో మనుష్యాకారము లుండుటవలన చిత్రోద్దేశములు స్ఫుటముగ కానవచ్చును. అచ్చటచ్చట లేతరంగులమధ్యను గాఢమైన రంగులతో మనుష్యాకారములను చిత్రించి వీటియందు భిన్నరుచులను జూపజాలిరి. ఈ రెండవతరగతి చిత్తరువులందు నల్లగ కొప్పును చూపుటవలన ముఖము తేజోవంతమై, చిత్రకారుడు చూపజూచిన భావములన్నియు స్పష్టముగ కానవచ్చును.

అజంతగుహాల స్త్రీ చిత్రములు* మాత్ర మీచిత్తరువులను సుప్రసిద్ధములుగ జేయుటకు చాలును. నవలాది గ్రంథరచయితల గొప్పతనము ముఖ్యముగ వారు సృజించు స్త్రీపాత్రలపై నాధారపడియుండునటులు చిత్రకారుల చాకచక్యమును వారి స్త్రీచిత్రములవలన గ్రహింపవచ్చును. అజంతచిత్రకారు లీవిషయమున మిగుల పరిశ్రమచేసి గెలిచిరి. వీరిచే సృజింపబడిన స్త్రీలందరు సురూపవతులు. వికారము స్త్రీలకిడుట యాచిత్రకార సన్న్యాసుల మతము కాదు. మగవా రెంత సురూపులై యున్నను, మనోహరములగు వస్తువు లెన్నియున్నను

---

* బొంబాయి చిత్రకళాశాల కధ్యక్షులుగ నున్న డబ్ల్యు. ఇ. గ్లాడ్‌స్టన్ సోలమన్‌గారు వ్రాసిన అజంతగుహాల స్త్రీలు అను గ్రంథము ననుసరించి యీభాగము వ్రాయబడెను.

స్త్రీలు ప్రపంచము నలంకరించుటయం దగ్రస్థానమున నుండుటకు తగిన వారలు. అజంతయందు స్త్రీ లిట్టి స్థానము నలంకరించియున్నారనుట నిస్సంశయము. ఎన్ని చిత్తరువులందు వీరు కానవచ్చినను సౌందర్యము లేనివారు మాత్ర మచ్చట కానరారు. పుష్పములచే హిందువులు పవిత్రహృదయముతో దేవు నెటులారాధింతురో యటులు అజంత చిత్రకారులు స్త్రీలతో నృపుల సభలను, వీథులను, కిటికీలను అలంకరించి లలితకళాసరస్వతి నారాధించిరి. మతవిషయికములగు చిత్తరువుల నే కాదు—అలంకరించు కొనునటులు, సంభాషించుచున్నటులు, నిలువబడియున్న టులు, సేవ చేయుచున్నటులు, భిక్షమెత్తుకొనునటులు స్త్రీలను చిత్రించి చిత్రకారులు తృప్తిజెందిరి. అలంకరించు కొనుటయం దద్వితీయులని గ్రహించి వారి స్త్రీలను తమకు తోచిన యన్ని భూషణములతోను నింపిరి. స్త్రీ లలంకా రముగ నుపయోగపడని చోటుల వారి యలంకారము లగు ముత్యములు మొదలగువాటి నలంకారముగ వ్రాసిరి. ఇట్టి స్త్రీల యారాధన యితర చిత్రసమితుల యందు కానవచ్చుట దుర్లభము. స్త్రీల నెన్నివిధముల వీరు చిత్రించినను, నిందారోపణము, పాతివ్రత్యములేమి మాత్రము కానరాదు. ఎచ్చట జూచినను వీరియెడ

సోదరీభావము కలుగుచుండును. అచ్చటచ్చట పురుషుల వద్ద వీరు కానవచ్చెదరు. కాని యసభ్యత మాత్రము వెదకినను కానరాదు. ఇంతకు మించిన నారీమణుల యారాధన వేరు కలదా?

స్త్రీలనేకాక తక్కినవస్తువులనుకూడ యీ చిత్రకారు లలంకారార్థము వినియోగించిరి. వీటి నత్యంతానందముతో పరిశీలించిన గ్రిఫిత్ గారు ఆశ్చర్యమున మునిగి పోయిరి. పర్షియా దేశపు తలపాగాలను, అంగీలను, గీరల షరాయీలను ధరించి నవ్వును పుట్టించునట్టియు, ఫల పుష్పములమధ్య విహరించునట్టియు, మద్యపానముచేసి యాడుచు పాడుచు నానందించునట్టియు మనుష్యులను, ఏనుగు, ఎద్దు, కోతి మొదలగు జంతువులను, చిలుకలు, బాతులు మొదలగు వింతపక్షులను, పూర్తిగ విడిన, సగము విడిన, విడుటకు సిద్ధముగనున్న కలువ, తామర పూవులను, మామిడి మొదలగు ఫలజాతులను అలంకారములుగ నుపయోగించిరి. వీటియందును చిత్రకారుల భావనాశక్తి, ప్రదర్శనశక్తి, జీవితప్రవాహామునగల యభిరుచి కానబడును.

సుగుణసంపత్తి గల యీయమూల్య చిత్రసంపద వలన సనాతనభారతనాగరికతాధిక్యమును మనము కొంత కనుగొనగలము.

---

# నాల్గవ అధ్యాయము

## అజంతగుహలు-౨

౯,౧౦ గుహలయందలి చిత్తరువులు బరుహుత్, అమరావతి, సాంచి వీనియందలి శిల్పములను పోలియుండుటచే నివి దక్షిణమున ఆంధ్రరాజుల పాలన కాలములందు క్రీ. పూ. ౨౭ మొదలు క్రీ. త. ౨౩౬ సం. వఱకు గల కాలమున చిత్రింపబడినటులున్నవి. ఆంధ్ర నృపులు బౌద్ధులు కాకపోయినను, విశాలహృదయులై, బౌద్ధమత వ్యాప్తి కెట్టియాటంకములను కలుగజేయక యుండుట వలన చిత్రరచన యిటులు వర్ధిల్లెను. ఆ కాలమున

“ మతగురువులకును, రాజులకును ఎట్టిసంబంధముండెనో తెలియదు. పాలకుల యాజ్ఞానుసారము సన్న్యాసు లీగుహలను దొలచి, యలంకరించుటసంభవము. ఈ నిర్మాణముల నంకితముగ గొనుటకు రాజులు కోరుటవలన పిమ్మట బౌద్ధసన్న్యాసులకును, రాజులకును మైత్రి యేర్పడినటులు కానవచ్చును. కాని ఎట్టి సంఘపరిస్థితులవలన నీ కళ యిట్లు వర్ధిల్లెనో తెలియదు.”

భారతీయ సన్న్యాసులు జనసంకులమైన స్థలమునందు నివసించుట యాచారముకాదు. అజంతగుహాలున్న స్థలమును జూడ నిది మొదటినుండియు మరుగుపడియుండినటులు కానవచ్చును. అట్టియెడ నీ సన్న్యాసులు ప్రపంచమునందలి మార్పులను సరకుగొనక తమ యారాధన, చిత్రరచన నిర్విఘ్నముగ నెరవేర్చుకొనుట సహజము; కాని వీరు ప్రపంచజ్ఞానశూన్యులు కారు: లోకమున జరుగు అరాజకముల జూచి యసహ్యపడి, యది యిచ్చు స్వల్ప సుఖములు నిస్సారములని గ్రహించి సన్న్యసించినవారు. అప్పటి కళాప్రపంచమున గల యుద్దేశములను బాగుగ జీర్ణించుకొని, మతావేశమువలన తమ జ్ఞానమును చిత్రరూపమున వెలిపుచ్చినవారు. ఇందువలననే యిట్టి చిత్రసంపత్తి.

పదియవ గుహాయందొక రాజు రాణుల, పరిచారికల మధ్య నానందించుచున్నటులు గలదు. ఈ కాలమునందును సంఘ మభివృద్ధిజెందియుండెననియు, బౌద్ధమతస్థు లొకవైపున త్యాగమును గూర్చి బోధించుచుండ నృపులు తమభోగములను విడువలేదనియు, ప్రపంచ మెంతమారినను మానవస్వభావము మ్మారుట దుర్లభమనియు నీ చిత్తరువును జూచిన స్ఫురించును. ఇందుగల

స్త్రీల శిరోజముల యేర్పాటు లనేకవిధముల నుండుట వలన చిత్రకారుడు లోకముతో బాగుగ పరిచయము గలిగియుండుట నిశ్చయము. ముఖ్యముగ చేతు లిందు బాగుగ నున్నవి. తొమ్మిదవ గుహాయందలి సేవకురాలు, దృఢమగు రేఖలతో గీయఁబడిన చిత్తరువులు, ఏనుగులు నాహ్లాదకరములు. గుఱ్ఱపు రౌతులు, బల్లెపు బంటులు, స్త్రీలు కల చిత్తరువులు పూర్వ మిందుండెడివి. కాని యిప్పు డవి కానరావు.

ప్రవేశాధ్యాయమున బేర్కొనిన నిదర్శనములను మరువక యింపలి చిత్తరువులను బరిశీలించిన నప్పటికే చిత్రరచన విరివిగ నామోదింపబడుచుండెననియు, చిత్రకారులు తమ విద్యయం దనుభవశాలురనియు గోచరించును. ఇందలి విగ్రహములు విశేషముగ నలంకృతములు కావు. వర్ణలేపనమున నాడంబరరహితములుగ నున్నను వ్యక్తుల యేర్పాటు మనోహరముగ నుండుటచే నన్యపురాతన చిత్రములకు విశేషముగ వెనుకబడవు.

అజంతగుహల నలంకరించుట తరువాత చాలకాలమువరకు విడచిపెట్టినటులు కానవచ్చును. "నాగార్జునుని యాధిపత్యమున నాగులు చిత్రించిన పిమ్మట యీ

కళ క్షీణదశకు వచ్చె"నని తారానాథుడు వ్రాసెను. ఈ కాలము బహుశః క్రీ. శ. ౧౨౦ మొదలు 3౫౦ సం. వరకు నైయుండవలెను. బుద్ధపక్షనృపునికాలమున మధ్య దేశమున చిత్రవిధానమును బింబిసారుడు స్థాపించెననుట అజంతయెడల వర్తించుచున్నది. ఈ కాలమున నచ్చట చ్చట కొందరు చిత్రకారులుండినను ప్రజలయామోదము చిత్రరచనయెడల తగ్గెను. దక్షిణమున నప్పుడు రాజకీయ సాంఘిక, ఆర్థిక పరిస్థితు లెటులుండెనో, చిత్రలేఖనము నణగద్రొక్కుటకు తదితరము లెవ్వి తోడ్పడెనో తెలి యరాదు.

కాని క్రీ.శ. 3౨౦వ సంవత్సరమున గుప్తుల విజృం భణమున, ముఖ్యముగ సముద్రగుప్తుని సుప్రసిద్ధపరిపా లనమున మరల నీ కళ యాదరింపబడెను. ఈ కాలమున పదియవ గుహాయందలి స్తంభములమీదిచిత్తరువులు వ్రాయబడి యుండవలెను. 3౫౦ లేక ౪౦౦ సంవత్సర ముల కివి చెందునని పరిశోధకులు నిర్ణయించిరి. ఈ పట ములు కాంతిమకుటములందును, దుస్తులతీరునందును పశ్చి మోత్తర పరగణములందు గాంధారశిల్పచిత్రములని పిలు వబడు యవన-బౌద్ధ శిలావిగ్రహములను బోలియున్నవి.

ఇవి కొంత నియమబద్ధములై యున్నను భావవైశాల్య మునందును, శిల్పియందును ఆగుహాయొక్క గోడలమీది పటములను మించియున్నవి.

అజంతచిత్తరువులం దధికాంశము క్రీ. శ. ౫౫౦ మొదలు ౬౪౨ సం. వరకు పాలించిన చాళుక్యరాజుల కాలమున చిత్రింపబడెను. వీరారుసందు రాజ్యముచేసిన వాకాటక రాజుల ప్రోత్సాహమున నారవశతాబ్దము నందు ౧౬,౧౭ సంఖ్యల గుహల చిత్రములు వ్రాయబడి యుండవలెను. ఈ రాజులసేవ చేసిన యొక యమాత్య పుత్రుని యాజ్ఞవలన నీ విహారము నిర్మింపబడెనని పదు నారవగుహాయందు సగము శిథిలమైయున్న శాసనమువలన దెలియుచున్నది. వాకాటకరాజుల పరిపాలన మెట్టిదియో తెలియదుకాని, మిక్కిలి ప్రబలియుండిన గుప్తవంశపు రాజుకుమార్తె నీరాజులలో నొకరు వివాహమాడి వారితో మిత్రులైయుండు పాటి గొప్పవారని మాత్రము నిస్సంశయముగ జెప్పగలము.

పదునారవగుహాయందలి చిత్తరువులు పదునేడవ గుహాయందలి చిత్తరువులకన్న కొంచెము ముందు వ్రాయ బడినవి. గ్రిఫిత్తుగారిందలి చిత్తరువుల ప్రతుల నల్పముగ

వ్రాయించిరి. ఒకానొకప్పుడిచ్చటి గోడలన్నియు సచిత్రములై యుండినటులు నిదర్శనములు కలవు. మిగిలియున్నవి చాలసుందరములుగను, భావజనకములుగను పర్షియాశిల్పకృతుల చిహ్నములతోను ఉన్నవి. "మరణించుచున్న రాకుమార్తె" యను చిత్తరువు సుప్రసిద్ధ చిత్రకళావిమర్శకుల పొగడ్తను బొందెను. గ్రిఫిత్సుగారు దీని నిటులు వర్ణించిరి:

ఒక యుత్తమవంశజాత తలగడపై నెడమచేతి నూతగనుంచి, పరిచారికయొక్క సహాయమున మంచముపై కూర్చొని యున్నది. వెనుకనుండి యొక బాలిక తన రొమ్ముపై చేతినుంచి యామెను జూచుచున్నది. రొమ్ముపైని వస్త్రబంధనము కల పరిచారిక యొకతె వింజామరముతో నామెను విసరుచుండ నింకొకతె స్తంభమువద్ద కూర్చుని యున్నది. ముందిరువురు స్త్రీలు కూర్చునియున్నారు. ప్రక్కగది యందిరువురున్నారు. అందొకడు పర్షియాదేశపు అంగరకాను ధరించి కలశమును, గిన్నెను పట్టుకొని నిలువబడియుండ నీగ్రోజాతి శిరోజములతోనున్న యితరవ్యక్తి యేమియో యాతని నడుగుచున్నాడు. మరియొక గదియందిరువురు సేవకురాండ్రు కూర్చొనియున్నారు.

విచారభావ ప్రదర్శనమునందును, కథను స్ఫుటముగ చెప్పుటయందును కళాప్రపంచమున దీనిని మించిన చిత్రములేదని వీరి యభిప్రాయము. కొందరు సేవకులు పరిచారము చేయుచుండ, నితరులేమియు దోచక కూర్చుని యుండ, స్త్రీలు (బహుశః బంధువులై యుండవచ్చును)

యేడ్చుచుండ, నొక సుందరస్త్రీ రోగబాధచే నాయా సపడుచున్నది. ఇట్టి చిత్తరు వెట్టి హృదయమునైన నాక ర్షింపకమానదు. ఇతర పరిస్థితుల నేర్పరచి విషాదమును చిత్రకారుడు వెలిపుచ్చెను కాని "రాకుమారిత" యొక్క ముఖమును మాత్రము మలినము చేయజాలక పోయెను. చుట్టునున్నవారి శిరోజము లనేకవిధముల నలంకృత ములైయుండ, రోగి జుత్తువిరియబోసికొని యున్నటు లుండుట వలన స్థితిగతు లాక్కుపరి స్ఫురించును.

ఈ గుహాయందలి మరియొక చిత్తరువునందును పర్షియాటోపీలవా రుండుటవలన నీకాలపు చిత్రకళకును, పర్షియా చిత్రకళకును సంబంధమున్నదా యని యను మానము కలుగును. పర్షియా యందాకాలమునకుగాని యంతకు పూర్వమునకు గాని చెందిన చిత్తరువులు కాన రాలేదు. ఒకటవ గుహాయందు "పర్షియారాయబారము" అను చిత్రముండుటవలన గూడ పర్షియాదేశస్థు లాకాల మున నిచ్చటికి వచ్చుచుండిరనియు నప్పటి గొప్పకుటుంబ ములందు పర్షియాదేశీయులు సేవకులుగ నుండిరనియు మాత్రము చెప్పవచ్చును.

పదునేడవ గుహాయందలి చిత్తరువులు అజంతయందలి యితర చిత్రముల నన్నిటిని మించియున్నవి. ముప్పది సంవత్సరములకు పూర్వము డాక్టరు బర్గెసుగారు అరువది యొక్క చిత్తరువులను వర్ణించిరి. ఇందలి జీవచక్రమును కళాభాగముగ గణింపలేము. బౌద్ధమతమును ప్రచారము చేయుట కిట్టివి తిబెత్తునం దిప్పటికి నుపయోగపరచుచున్నారు. తదితర చిత్రములు అజంతవిధానములను బాగుగ వ్యక్తపరుపగలవు. వీటివలన కొన్నికథలను పూర్తిగ జిత్రకారులు ప్రజలకు బోధపరుపజూచిరి. ఎట్టిమార్గముల వలన సన్న్యాసులు బౌద్ధమతమును ప్రజలకు జాటజూచిరో యిందు తెలియగలదు. తక్కిన చిత్రములవలె నీకథలును ముఖ్యముగ బుద్ధభగవానుని జీవితచరిత్రకును, మరణమునకును చెందినవి. ఇట్టి యుద్దేశము కల చిత్తరువులం దత్యున్నతభావములకు విశేషముగ తావులేదు కాని, ప్రజల నాకర్షించుట కివి వివిధములగు రంగములందు చరిత్రను స్పష్టముగ ప్రదర్శించు చలనచిత్రములు (Action pictures)గ నున్నవి. అంతకు పూర్వపు చిత్రవిధానములను మర్కటములవలె నవలంబింపక నూతన విధమున ఘనోద్దేశములు నెరవేరునటులు తమకళ నుపయోగపరచిరి. బౌద్ధమత ప్రతిభ యీకాలమున నశించు

చుండుటచే బౌద్ధసన్న్యాసు లిట్లు ప్రజలను మరియొక మా రాకర్షించుటకు మహాప్రయత్నములను జేసినటులు కనబడుచున్నది. ఇట్లు హెర్రింగాము సతి పొగడెను:

సింహము కణుతులవేటాడుట, ఏనుగులవేట, రాజుదర్బారున ఏనుగుసలాముచేయుట అను మూడు చిత్తరువులు పదునేడవ గుహాయందున్నవి. తక్కిన వాటికిని, వీటికిని భేదము కలదు. ఈచిత్రములు ఛాయ వెలుతురులయేర్పాటున పదునేడవ శతాబ్దమునకుపూర్వపు ఇటలీ చిత్తరువులను మించియున్నవి. పచ్చిక, ఆకుల యొక్క తేజోహీనమైన ఆకు పచ్చరంగు తప్ప, చిత్రములు లేతరంగులతో గలవు. పొందిక, యేర్పాటులయందు నవీనములుగను, స్వాభావికములుగను, వ్రాతయందు స్వేచ్ఛతోను, ...... వర్ణలేపనమునందు ధృఢముగను, ...... ఉన్నవి. మృగములు — గుఱ్ఱములు, ఏనుగులు, కుక్కలు కణుతులు — చక్కగ వ్రాయబడినవి.

పదునారవ గుహాయందలి "మరణించుచున్న రాకుమార్తె" యను చిత్తరువువంటి దిచ్చటను కలదు. ఒకరాణి రోగపీడితయై మరణమును సమీపించుచు విచారముతో నున్న తన భర్తయొక్క విశాల వక్షస్థలముపై నొరగియున్నది. ఇచ్చటను చిత్రకారుడు రోగమునందలి సౌందర్య వినాశక చిహ్నములను, మరణ సూచనలను చూపజాలక పోయెను.

## నాల్గవ అధ్యాయము

తల్లియు, పిల్లయు బుద్ధునారాధించునటులు నీగుహాయందొక చిత్రము కలదు. కుమార్తెముఖము నందానందమును బుద్ధదేవుని జీవితాదర్శములను గ్రహింపజాలిన తల్లియొక్క వదనమున గౌరవభావము, భక్తి తాండవమాడుచున్నవి. తల్లియొక్క హస్తములు కుమారిక భుజముపైనుండుటవలన నామె తన యనుంగుబిడ్డను బుద్ధదేవునారాధించి పవిత్రురాలవు కమ్మని ప్రోత్సాహపరచుచున్నటులు తోచును. ఎంతో యింపుగ వ్రాయబడిన శిరోజముల నీచిత్తరువున ముఖ్యముగ జూడదగును.



* పదునేడవగుహయందు మహాహంసజాతకమును గూర్చిచెప్పు కుడ్యచిత్రమున చిత్రకారుని వర్ణజ్ఞానము చూడదగును. ఖేమరాణి బంగారు హంసలను కలయందు జూచి యట్టిదానినొకటి తనకు తెప్పింపుమని

---

* పెర్సీబ్రౌనుగారి "హైందవ వర్ణలేపనము" ను జూడుడు.

సంయమ నృపుని బ్రతిమాలెను. తన పాలితులచే త్యజింపబడిన హంస రాజును, తన్నువిడువకయుండిన సుముఖుడను మంత్రిని రాజమృగయుడు పట్టి సంయముని వద్దకు తేగా నాతడు వాటిని విశేషముగ గౌరవించెను. హంసరాజాతనికి నీతిని బోధింప వాటినివాసమగు చిత్రకూట సానువులకు బొమ్మని విడచిపెట్టెను. ‘ఇంతటితో’ బుద్ధుడు కథను ముగించి జన్మరహస్యము నెరిగించెను. మృగయుడు ఛన్నుడుగను, ఖేమరాణి ఖేమదాసిగను, రాజు సారిపుత్తుడుగను, సుముఖుడా నందుడుగను ఉండిరి. హంసరాజు ‘నేనే’ అని జాతకమున గలదు.

* * * * ఒకసేవకుడు ఛత్రమును బట్టియుండ, రెండవ సేవకుడు వింజామరమును వీచుచుండ, పరివార మాజ్ఞకై వేచియుండ రాజు సింహాసనారూఢుడై యున్నాడు. మూడవ సేవకుని ముఖము నల్లగనున్నది. ఈతడు బహుశః నీగ్రో కావచ్చును. తీవ్రమైన యెరుపుఛాయకలవాడు రాజు పాదములవద్ద నున్నాడు. ఈతడు తన కథనుచెప్ప! రాజమృగయుడు కావలెను. కాని మధ్యనున్న హంసల నందరు నేకాగ్రచిత్తముతో జూచుచున్నారు. మీదనున్న చాందినీని రాజు బహుశః ఈపక్షులను గౌరవించుటకు కట్టించినటులు కనబడును. వెనుకభాగమున వ్రేలాడుచు నలంకారములతో నున్న ‘కణాతు’ (తెర) యీ సభ బహిరంగము కాదని తెలియజేయును. ఈ హంసలనుబట్టిన విధానము నిజమని చెప్పుచు కాబోలు నొక హీనకులజుడు రాజుయొక్క పాదములచెంత గూర్చొనియున్నాడు. ముందుభాగమున నెర్రనిపద్మములతోను, నీటిమొక్కలతోను నిండియున్న జలాశయము కలదు. ఇందాడుచున్న జలపక్షులు అడవిపక్షులకు గల స్వేచ్ఛను తెలియజేయును.

* * * * ఈ చిత్తరువున తేలికరంగులతో నున్న మానవులను, గాఢమైన ఆకుపచ్చరంగుతో నున్న వెనుక భాగమునకు వ్యతిరేకముగ వ్రాయబడెను. ఆ యాకుపచ్చరంగు దిగువ నలుపుగ బరిణమించెను. చిత్రముయొక్క క్రిందిభాగమున పసుపుపచ్చయు, మధ్యమధ్యగల తెలుపును, లేత యెరుపును మనోహరముగ అంతర్లీనమై యున్నవి."



ఒక రాజతనయ అలంకరించుకొనుచుండ పరిచారిక యామె బడలికతీరుటకు విసరుచున్నటు లొక చిత్రము కలదు. ఇందు పరిచారికయొక్క పొందిక చాల యింపుగనున్నది. నిలువబడినరీతి విసరువిధానము స్వేచ్ఛతో వ్రాయబడెను. ముఖమున గౌరవభావము, సంతోషము వినమ్రత, మూర్తీభవించి యున్నవి. రేఖాసౌందర్య వర్ణలేపన చాతుర్యములందు తక్కిన యే యజంత చిత్తరువుతోనైనను సరి తూగును.

పందొమ్మిదవ గుహయొక్క శిల్పము చాలచక్కనిది. బౌద్ధుల శిల్పరాజములలో నిది యొకటని ఫెర్గుసన్‌గా రభిప్రాయ

పడిరి. ఇందలి చిత్తరువులు ముఖ్యముగ బుద్ధుని జీవితము నకు జెందినవి. పుష్పగుచ్ఛము లలంకారములుగ నుప యోగపరుపబడెను.

బుద్ధునకు తల్లియు, ఆమెశిశువును భిక్షమిచ్చుచు గౌరవించుచున్నటు లొకచిత్తరువు కలదు. ఇది పదునేడవ



గుహయందలి చిత్తరువును పోలియున్నది. బుద్ధదేవుని విగ్రహము, గౌరవముతో తన శిశువుచే భిక్ష మిప్పించుచున్న మాతృప్రేమభరితయు, సలంకృతయునగు స్త్రీ రూపము, భయభక్తులు తాండవమాడు హృదయముకల బాలుడు ఎట్టివారినైన నాకర్షింపక మానవు.

రెండవపులికేశి అనురాజు వద్దకు పర్షియా రాజగు ఖుస్రుపర్విజ్ పంపిన రాయబారము చిత్తరువు ఒకటవ గుహయందుండుట వలన ౧, ౨ సంఖ్యలుకల గుహలు ఏడవశతాబ్దపు ప్రారంభమున నిర్మింపబడెనని నిర్ణయింపవచ్చును. ఈ రాయబారము క్రీ.శ. ౬౨౬-౬౨౮ వ సంవత్సరముల జరిగియుండెనని దేశచరిత్రవలన తెలియును. ఇప్పటికి బౌద్ధమతము క్షీణించుచుండెను. ప్రజల యుత్సాహము తగ్గినకొలది బౌద్ధసన్యాసులయు, చిత్రకారులయు కలవరపాటు హెచ్చుకాజొచ్చెను. ఈ చిహ్నములన్నియు నీ గుహల చిత్తరువులందు గానవచ్చుచున్నవి. పర్షియా దేశపు చిత్తరువులచ్చటచ్చట గానవచ్చుచుండుట వలనను ఖోటానున కానవచ్చు చిత్రవిధానముల చిహ్నము లుండుటవలనను, పర్షియాతో నీకాలమున బాగుగ సంపర్కమేర్పడినటులును, పర్షియావిధానములను కొంతవరకు

హైందవచిత్రకారు లనుసరించినటులును కానవచ్చును. చైనాచిత్తరువుల ననుసరించియు కొన్నికలవు. బౌద్ధ సన్న్యాసులు మొదట మతప్రచారమునకు చైనా మొదలగు దేశములకు తీసుకొనిపోయిన చిత్రముల ననుసరించి యచ్చటివా రభ్యసించి తమజాతీయ రుచులకు సరిపోవునటులు చిత్రములను మార్చిరి. టాంగ్ రాజ్యకాలమున జిత్రింపబడిన చిత్రములు దీనికి నిదర్శనము. బౌద్ధచిత్రకారులు హిందూ దేశమున వెనుకబడినపిమ్మట ప్రాచ్యదేశములందు మార్పుజెందిన విధానములు మరల మన దేశమున వ్యాపించినవి. ఇతర దేశపుస్వమతస్థులతో హైందవబౌద్ధులు సంపర్కముగలిగి యుండుటనుబట్టి యివి యజంతయందు కానవచ్చుట సంభవించెను.

రెండవ గుహాయందలి చిత్తరువులం దిట్టి లోపము లున్నను ముఖ్యవిగ్రహములు మాత్రము చాలసుందర ముగనున్నవి. స్త్రీల ఒయ్యారము నీకాలపు చిత్రకారు లతి నిపుణతతో ప్రదర్శింపగలిగిరి. అలంకృతయైన యాతురతతోను, సిగ్గుతోను, ప్రేమతోను స్తంభమునకు జేరబడి యున్న యీ యౌవనవతిని జూడుడు. ప్రియు డెంతకు రాకపోవుటచే యేమియు దోచక యామె యెటులు తన

గోటిని మీటుచున్నదో చూడుడు. ముద్రయం దజాతచిత్రకారులకు గల ప్రవీణత యిందు మనకు కొంత యగుపడును. చిత్రకారుడు తన ప్రియురాలినే యిటులు చిత్రించెనేమో! ఈమె కిట్టి సొగసైన నగలుండుట కిదియే కారణమేమో!



ఒకటవ గుహయందలం కారప్రాయముగ చిత్రింపబడిన చిత్తరువు లాహ్లాదకరములు. ఈ గుహచిత్తరువులు పేరుమ్రోగుట కివియే చాలును. ఎద్దులు రెండు, పౌరుషముతో పోరాడుచున్నటులు గల చిత్తరువున నిజమగు జీవచలన చిహ్నము లద్భుతముగ నున్నవి. పెద్దచిత్తరువులలో గౌతమబుద్ధునకుసంబంధించిన చిత్రమాల బాగుగనున్నది. పర్షియారాయబార ప్రదర్శనము శ్లాఘనీయము. ఈ పెద్దచిత్తరువుయొక్క నాలుగు మూలలందును దీనికి సంబంధించిన చిత్తరువులు కలవు. ఖుస్రురాజు (?) సుప్రసిద్ధురాలైన తన షిరీన్ రాణితోగూర్చొని మద్య

పానముచేయుచున్నటులు గలదు. ఇందలి రూపము లత్యద్భుతముగ మొగలాయియాలను బోలియున్నవి. ఒకచిత్తరువున రాణియు, నామె పరిచారికలును భిక్షమిడుచున్నటులు గలదు.

* ఒకటవ గుహాయందలి ఫలకమున దుఃఖముతోనున్న స్త్రీచిత్రమొకటి కలదు.............తన్ను చంపనుద్దేశించి ఖడ్గపాణియైయున్న రాజునెదుట యామె వినమ్రయై యున్నది. చిత్రలేఖనము మనోహరము, నల్లనిరేఖలు ఇంగ్రెసుగారి రచనను పోలును. ఇంతటి మహాసమయమున నాముఖసౌందర్యమును దాచినటులుచేసిన కళయద్భుత మనదగును. తన్ను క్షమింపజేయుటకు దృఢసంకల్పముతో నున్న వాని పాదముల సోకుటకు వెరచుచు, వణకుతో సాచియున్న హస్తముల మధ్య శిరముమాత్రము కానవచ్చుచున్నది. రానున్న శిక్ష న్యాయమైనది; కాని యెంతఅద్భుతముగ కరుణారసమును చిత్రకారుడు ప్రదర్శించెను! నాశనమునకు సిద్ధముగనున్న యీ మహాసౌందర్యము పాపియొక్క పాపమును మరుగుపరచు చున్నది.........

మరియొకగొప్ప చిత్తరువుకలదు.ఇది బోధిసత్వావలోకితేశ్వరుని గూర్చియో సిద్ధార్థుని సర్వసౌఖ్య పరిత్యాగమునుగూర్చియో తెలియుటలేదు. దీనియర్థమేమైనను ఇందు కనబడు విచారముకనికరము మహాద్భుతములు.ఇది

---

* గ్లాడ్‌స్టను సోలమనువారి "అజంతయందలి స్త్రీలు" అను గ్రంథమునుండి.

చూచువారికి విచారకరమగు గొప్పకార్యమును జేయ సిద్ధమైన మహాపురుషుని యెదుట నిలువబడియున్నటులు దోచును. ప్రాపంచిక సుఖమును విడనాడు విచారమును దానివలస ముందుగలుగబోవు శాంతియు నిందుమేళవించి యున్నవి. చిత్తరువు పెద్దదగుటవలన నీభావములు ద్విగుణీకృతములగుచున్నవి.

క్రీ. త. ౮౫౦ వ సంవత్సరమున చెక్కబడినవని పండితులచే నిర్ణయింపబడిన మధ్యజావాయందలి సుప్రసిద్ధ బౌద్ధశిల్ప మీగుహాయందలి చిత్తరువులను బోలియున్నది. హైందవ చిత్రలేఖన విధానములు మతప్రచారమువలన జావాయందు వ్యాపించెననియు పిమ్మట యీ



విద్య యచ్చట యభివృద్ధినొందద తత్ఫలముగ బారోబు దరు స్తూపము నిర్మింప బడెననియు నిర్ణయింపబడెను.

అజంతచిత్తరువులం దనేకములగు లోపములున్నవి. ఇప్పటి చిత్తరువులను జూచి వాటిని విమర్శించుట భావ్య ము కాదు. ప్రపంచమునం దితర దేశములు చిత్రరచన శైశవదశయం దున్నప్పు డిట్టి చిత్తరువులను భారతదేశము



సృజింపగలిగెను. ప్రకృతినుండియు అధికాంశము స్వాతం త్రముగ వ్రాయబడినవగుటజేసి వీటియందు ప్రాణము కలదు. ప్రతిముఖమును భావపూరితము; ప్రతి చిత్తరువును మనోభావములను వేల్కొల్పును. ఫలపుష్పములకు,

జంతువులకు, మనుజులకు-జీవప్రవాహమునందలి యన్ని తరగతులకును — ఈచిత్రపంక్తియందు తావుకలదు. అన్నియు చిత్రకారునిచే తగురీతిని గౌరవింపబడెను. క్షీణించెడి వస్తువులన్నియు దైవశక్తులయావిర్భావమనియు, సకల జీవరాసుల కదలిక దేవునివిలాసమనియు నమ్మిన చిత్రకారులు భక్తితోను, గౌరవముతోను వీటిని చిత్రించినప్పుడవియన్యముగ నుండునా?

చాలకాలమువరకు మనము పాశ్చాత్యచిత్ర విమర్శకుల యుద్దేశములపై నాధారపడవలసియుండెను. బౌద్ధమతమును, హైందవచిత్తవృత్తిని, అజంతపరిస్థితులను ఎరుగనివారు వీటి నగౌరవపరచుట వింతకాదు. ఈపెద్ద చిత్తరువులను చిన్నవిగను, రేఖామాత్రములుగను ప్రచురించుటవలన వీటిరచనా చమత్కారము చాలవరకు మరుగుపడుచున్నది. కాని అజంత చిత్తరువులిట్టి ప్రతికూల పరిస్థితులందైనను మనోహరములుగ నున్నవి. పాశ్చాత్య విధానముల నవలంబించుటవలననో వారుచేసిన విమర్శన వలననో కలిగిన విరోధభావములన్నియు నజంతయాత్రతో తొలగిపోవును. అజంత చిత్తరువుల గొప్పతనమున కిదియొక తార్కాణము.

రంగులు వాడుటవలనను, వెనుకప్రకరణమున జెప్పిన యితర కారణములవలనను ఈ చిత్తరువులు చాలవరకు రూపుచెడియున్నవి. వీటియాధిక్యమును సంశయించు వారివిషయమును జ్ఞప్తియందుంచుకొనుట చాల ముఖ్యము.

---

# అయిదవ అధ్యాయము

---

### బాఘ్-సింహళము

బౌద్ధులకాలమునగుహలు రాజగృహములు విహారములు సచిత్రములైయుండెనని యిదివరకు చెప్పి యుంటిని. అజంతగుహలుతప్ప తక్కినవన్నియు ననేకకారణములవలన నశించెను. నిర్మాణములున్నను వాటిగోడల మీదనుండిన చిత్రములిప్పుడు కానవచ్చుటలేదు. బాఘ్ గుహ లీతరగతికి జేరినవి.

గుజరాతు మాల్వా దేశములకు రాకపోకలేర్పరచు పురాతనమార్గము చెంత గ్వాలియరురాజ్యమున నీగుహలు కలవు. ఇందు ముఖ్యమైనవి యెనిమిది. వీటిలో నన్నిటికంటెపెద్దది ౯౨ అడుగుల చదరము. దీనిగోడలు, కప్పు, స్తంభములు విలువైన చిత్రరచనలతో నిండియుండెను. మరి రెండు గుహలందును చిత్రచిహ్నములు కలవు. వర్షము వలనను, సున్నము రాలిపోవుట వలనను ప్రయాణికుల వంటల పొగవలనను ఇవి యిప్పుడు బాగుగ కానరాకు

న్నవికాని గొప్పచిత్రకారులు వీటిని తడుపుచు కానవచ్చి నంతవరకు ప్రతులను వ్రాసియుండుటచే గొన్నియైనను లభించినవి.

ఎట్టి పరిస్థితులయం దీగుహాలు నిర్మింపబడినవో, ఆ కాలమున నాప్రాంతములం దెవరు పాలించుచుండిరో నిర్ణయించుటకు వీలులేదు. శాసనములు, వీటిని పేర్కొను పురాతన గ్రంథములు లభించుటలేదు. గుప్తరాజ్యకాలమునాటి శిల్పములందువలె తలపాగాలు దేహమునకంటియుండు దుస్తులు నిచ్చటిపటములందు కానవచ్చుటవలనను, చిత్రరచనయందును, గుహా నిర్మాణమునందును అజంత గుహాపంక్తిని బోలియుండుటవలనను ఇవి యేడవ శతాబ్దమున నిర్మింపబడెనని చెప్పవచ్చును. దేశపటముపై తిన్నగ కొలచిన నజంత బాఘుల నడుమ సుమారు ౧౫౦ మైళ్లదూర ముండును. రాకపోకలకు వీలులేనటు లీరెండు ప్రదేశములకు మధ్యను నర్మదయున్నది. అందువలన నీ చిత్తరువులన్నియు నొకే చిత్రకారులచే వ్రాయబడెనని చెప్పజాలము. దేశమందంతట నభ్యసింపబడిన చిత్రకళా విధానము లీరెండుచోట్లను కానవచ్చుటవలన నివి యొకే కాలమునకు జెందియుండవలెను.

౧౮౧౮ వ సంవత్సరమున కెప్టాను డేంజరు ఫీల్డుగా రీగుహాలను చూచి సం. ౧౮౨౦న ఆంగ్లలోకమునకు వెల్లడిచేసిరి. వీరు రచించిన చిత్తరువులిప్పుడు కానరాలేదు. డా. బర్గెస్సుగారు వీటినిగూర్చి వ్రాయుచు 'గ్రిఫిత్తుగారు శిష్యవర్గముతో బోయి యీ చిత్తరువులను వ్రాసిన బాగుగనుండు'నని సూచించిరి కాని యిది జరుగలేదు. ఈమధ్యను మేజరు లువార్డుగారు వీటివర్ణనను పూర్తిగ వ్రాసిరి. గ్వాలియరు సంస్థానపు ఆర్కియలాజికల్ డిపార్టుమెంటువారి సహాయమున ఇండియా సంఘమువా రీగుహాలనుగూర్చి చక్కని గ్రంథమును ప్రచురించిరి. హల్దారు, బోసు మొదలగు సుప్రసిద్ధచిత్రకారులు చిత్తరువులనమూనాలను పూర్తిగ వ్రాసిరి.

ఈ చిత్తరువులందు కొన్ని మధ్యమధ్య నెర్రమట్టి రంగుతోను, ముఖ్యముగ నలుపు తెలుపులతోను, కొన్ని అజంతపటములవలె గాఢమగునీలి, యెరుపు, పసుపు వర్ణములతోను జిత్రింపబడినవి. ఈ రెండుతరగతులు రెండు భిన్నకాలములకు జెందుట స్పష్టము.

కొన్ని బౌద్ధమతమున కేదోవిధమున జెందినవైనను అధికాంశము మతేతరములు. బౌద్ధులచే వ్రాయ

బడిన చిత్తరువు లిట్టివి ఉండుటచే కొందరి కాశ్చర్యము కలుగుచున్నది. కాని బౌద్ధమతము క్షీణించుచుండినప్పుడు మతమున దురాచారములు చేరెను. హిందూదేశమున నితరస్థలములం దిట్టివి లేకపోలేదు. ఇవియు నీ గుహలకాలము నిర్ణయించుటయందు తోడ్పడుచున్నవి. ఒక పురుషుడు నాట్యముచేయుచుండ కొందరు స్త్రీలు వాద్యము వాయించుచున్నటులు రెండు చిత్తరువులు కలవు. ఇది



హాల్లీసకమను నృత్యమని నిర్ణయింపబడెను. శాస్త్రమును బట్టి యిట్లు నృత్యముచేయువారు ఏడుగురు, ఎనమండ్రుడు, లేక పదుగురు ఉండవలెను. ఈచిత్తరువునం దారుగురు ఏడుగురు మాత్రమేకలరు.

## అయిదవ అధ్యాయము

హిందూదేశమున నీకాలమునకు చెందిన చిత్తరువులు మరెచ్చటను కానరావు.

పూర్వమునుండియు బౌద్ధులు సింహళముతో సంపర్కము గలిగియుండుటవలన నిచ్చటను పురాతన చిత్రములు కానవచ్చుచున్నవి. మేతలిజిల్లాయందు సీగిరియ యను నొకగిరి కలదు. సీగిరియయన సింహగిరియని యర్థము. సూదివలె ౬౦౦ అడుగులయెత్తుకల యీ కొండయొక్క శిఖరమున నొకదుర్గమున్నది. తండ్రిని జంపి క్రీ.శ. ౪౭౯ మొదలు ౪౯౭ వరకు రాజ్యముజేసిన మొదటి కశ్యపుడు దీనిని నిర్మించెను. ఇందుగల యింపైన చిత్తరువు లిప్పుడీదుర్గమునకు కీర్తిదెచ్చెను. ఈచిత్తరువులన్నియు నీరాజుకాలమున వ్రాయబడుట నిశ్చయముకాన నివియు, అజంతయందలి పదునేడవగుహాయందలి చిత్తరువులు నొకేకాలము నాటివి కావచ్చును.

హైదరాబాదు ప్రభుత్వమువారు అజంత చిత్తరువులయెడల నెంత యనాదరముతో మెలగిరో సింహళ ప్రభుత్వమువారు సీగిరియా చిత్తరువుల యెడల నంత యనాదరముతో విశేషధనమును వెచ్చించి హెచ్. సి. పి. బెల్‌గారిచే పదిసంవత్సరములు పనిచేయించి దుర్గమును,

అందలి చిత్తరువులను కాలప్రవాహమువలన గలుగు వినాశమునుండి సంరక్షించిరి. చిత్తరువులముందు తీగలతో చేయబడిన వలలను కట్టించుటచే నివి ఇప్పుడు సురక్షితముగ నున్నవి.



ఈ చిత్తరువులన్నియు నిరువదిరెండు. ఇందొకచేయి మాత్రమే ఉన్నది. కనుక మానవవిగ్రహము లిరువదియొకటి. మొదటిగదియందు సహజ పరిమాణముకంటె కొంచము పెద్దవి పదునేడును, రెండవగదియందు కొంచెము

చిన్నవిగ నైదును కలవు. ఎ. ముర్రెగారు ౧౮౮౯ వ సంవత్సరమున పదమూడు విగ్రహముల ప్రతులను వ్రాసిరి కాని తరువాతను పెరీరగారు చిత్రించిన నూనె రంగుల ప్రతులు ముర్రెగారి కళాసేవను మరుగుపరచెను. ప్రశం



సార్హముగ తొలి చిత్తరువులను బోలియున్నవని యివి ప్రసిద్ధిగాంచెను.

కొందరుస్త్రీలు పరిచారికలతో వరుసగ కొండకుత్తరభాగముననున్న 'పిదురెంగల' బౌద్ధదేవాలయమునకు ప్రార్థనవిషయమై పోవుచున్నటు లీచిత్తరువులు కలవు. ఇరువురుస్త్రీ లొకేచోటనున్న సందొకతె దాసివలె కనబడుచున్నది. కొన్నిచిత్తరువులందు రొమ్మున కొకబట్టయు దిగువభాగమున 'కంబేయ'యను వస్త్రమును కలవు. లేత

పసుపు లేక నారింజవర్ణముతో సుందరముగనున్న వారం దరు కశ్యపుని రాణులనియు, ఆకుపచ్చ వర్ణముగలవారు పరిచారికలనియు నిర్ణయింపబడెను. క్రిందిభాగమున మేఘముల వలె రంగు పూయబడెను. ఈ స్త్రీలు స్వర్గనివాసుల నుట కిది చిహ్నమని కొందరి యూహ కాని క్రిందిభాగమున మెత్తుడు బాగుగ లేకపోవుటచే కాళ్లను చిత్రించుటకు సాధ్యముకాలేదను బెల్ గారి యూహ యెక్కువ యామోదమును బడసెను.

ఇవి యజంతయందలి మంచిచిత్తరువులతో సరిపోలవుకాని స్త్రీవిగ్రహములు చాలబాగుగనున్నవి. వ్రేలిముద్ర, కలువపూవుల ప్రాముఖ్యము, రేఖలయింపులందు అజంత చిత్రములను బోలియున్నను అచ్చటి భిన్నరుచులు ఇచ్చట లేవు. ఒయ్యారముతో ఫలపుష్పములను, సంగీత యంత్రములను సీగిరియ స్త్రీలు పట్టుకొనియుండుట వలన నిందొకవిధమైన సొగసు కలదు. విగ్రహములు జీవకళాపూరితములు. కోమలములగు చేతివ్రేళ్లు బహుసుందరములు. రచనయందు చేసినమార్పు లిప్పటికిని కానవచ్చుచు చిత్రరచనావిధానములను బట్టి యీ చిత్రకారులు మిగుల ప్రవీణులని చెప్పవచ్చును.



సున్నమున జిగటమన్ను, ఊక, కొన్నిచోటుల కొబ్బరిపీచును గలిపి అరయంగుళము దళసరిగమెత్తి దానిపై పావునుండి అరయంగుళమువరకు దళసరిగ సున్నమునుపూసి బాగుగ నారబెట్టి చిత్తరువులను వ్రాసినటులు గానవచ్చుచున్నది. ఆకృతిని ఎరుపు, నలుపు వర్ణముల రేఖలతో నేర్పరచి ఎరుపు పసుపు ఆకుపచ్చలతో చిత్రించిరి. అజంత, బాఘ్ చిత్తరువులందు కానవచ్చు

నీలిరం గిచ్చటలేదు. రేఖలను గీచినవారే రంగులను పూసిరని నిర్ధారణగ జెప్పజాలము.

ఈ చిత్రకారులెవరో, యెచ్చటినుండివచ్చిరో, యెట్టి యాదరణను బడసిరో నిర్ణయించుట కాధారములు లేవు.

అనురాధపురమున గూడ ననేకస్థలముల జిత్ర చిహ్నములుకలవు. 'రుసవేలి'డగోబాకుతూర్పునగలయొక నిర్మాణమున గానవచ్చునవి ఇందు ముఖ్యములు. 'సైమ్రద రు'గారి చిత్తరువులను బట్టిచూడ రేఖలందును, అలంకార ములందును అజంతచిత్తరువుల నివి పోలియున్నవి. ఇవి



యేకాలము నాటివో చెప్పజాలము. ఈ చిత్తరువులపై నెవరో యనేకపర్యాయములు దిద్దినటు లుండుటచే నివి డగోబా కట్టినవెంటనే చిత్రింపబడినటులు కానరాకపోవు. కావున డగోబాయొక్క కాలనిర్ణయమున నివి మనకు సహాయకారులు కావు. కాని యివి యారు, ఎనిమిది శతాబ్దముల నాటివై యుండవచ్చును.

వీటియందు తెలుపు, పసుపు, ఎరుపు, నీలిరంగులు కానవచ్చుచున్నవి. ఆకుపచ్చ కావలసినప్పుడు నీలిని, పసుపును గలిపిరి. పసుపురం గధికముగ నుపయోగపరుప బడెను.

'తమంకడువ' సమీపమున గల రెండుగుహాలందు బెల్‌గారు కొన్ని చిత్తరువులను జూచిరి. ఇవి విశేషముగ చెడలేదుకాని యంత విలువగలవికావు. కిరీటముల తోను, కాంతి మకుటములతోను ఐదుగురు భక్తులు కూర్చొని యున్నటు లొకచిత్రము కలదు. ఇది పురాతనమేకాని కాలనిర్ణయము చేయుట కాధారములు లేవు. ఇది ఏడవ శతాబ్దమునకు బూర్వపు చిత్తరువై యుండును.

ఇట్టి చిత్రరాజములు సృజింపబడుటకు బౌద్ధమత ము ముఖ్యకారణము. బౌద్ధమతము లేకపోయిన భారత

భూమియందు చిత్రలేఖనము నశించియుండునని చెప్పుట కాదు. దేశమున జిత్రకారులను జూచియు, చిత్తరువులందు బ్రజలకుగల యాసక్తిని గనిపెట్టియు బౌద్ధులు తమ మత వ్యాప్తి కిది యొకయాధారముగ గొని చిత్రకారులను బ్రోత్సాహపరచిరి. ప్రజల యుద్యమబలము లేనిది రాజుల పోషణమాత్రమున నీ కళ యింత వ్యాపించి యుండ జాలదు.

---

# ౧౪వ యధ్యాయము

---

## చిత్రలేఖనము క్షీణించుట

అజంత చిత్రకారులు ౬౪౨వ సంవత్సరమున తమ రంగులను, కుంచెలను విడిచిన నాటినుండియు సుమారు ౧౫౭౦వ సంవత్సరము వరకు—అనగా అక్బరు చక్రవర్తి చిత్రరచనను ప్రోత్సాహపరచినవరకు—హిందూదేశమున రచింపబడిన చిత్తరువు లెచ్చటను గానరాకపోవుట యాశ్చర్యము. మిక్కిలి యభివృద్ధిజెందగల కళాబీజము లజంత చిత్రములందు గలవని కళావిమర్శకు లభిప్రాయపడియుండ చిత్రలేఖన ముక్కపరి క్షీణించియుండదు. పర్షియాదేశపు చిత్రవిధానముల విదేశీయులు ప్రవేశపెట్టిన వెంటనే వాటియందు హైందవులు ప్రవీణులగుట వలన నీరీవిద్య కచ్చటచ్చట జీవమును బోసి యీ వేయి సంవత్సరములు నేదో యొకవిధమున బోషించియుండిరని యూహింపవచ్చును. లేనియెడల చిత్రవిద్యయన్న నేమియో యెరుగనివారు కొంత ప్రవీణత గలిగియుండిన

విదేశపు చిత్రకారులతో వారి విద్యయందు సమానులుగ నుండజాలుట యసంభవము. ఇందుకు కొన్ని నిదర్శనములు కలవు:

౧. పదునైదవ శతాబ్దమునకు జెందిన జైనమత గ్రంథములయందు కొన్ని చిత్తరువులు కానవచ్చుచున్నవి.

౨. ఈ కాలమున దశ్వంతు అనే చిత్రకారు డుండెనని నిదర్శనములు కలవు.

3. తారానాథుని చరిత్ర.

ఇదివరకు జెప్పినటులు హిందూదేశపు చిత్తరువులన్నియు గోడలమీద వ్రాయబడుటవలన కాలవాహిని యందవి కొట్టుకొనిపోయెను. గ్రంథకర్త లీకళాచరిత్రము నెన్నడును వ్రాయ దలపెట్టకపోవుటవలనను, తక్కిన గ్రంథములం దెట్టియాధారములును గానరాక పోవుట వలనను, ఈ కాలపుచిత్రరచననుగూర్చి విశేషము తెలియకున్నది. అచ్చటచ్చట నంయెత్తినను, మొత్తమున నీ విద్య యనేక కారణములవలన క్షీణించెను.

భాషయందు, మతమునందు, ఆచారమునందు, వేషమునందు, సాంఘికజీవనమునందు హిందువులతో నెట్టి సంబంధమునులేని మహమ్మదీయు లీదేశమును

జయింప మొదలిడిరి. హిందూనృపులందు గొప్పవారు లేకపోవుటవలన దేశమున నుత్సాహము సన్నగిలెను. గుప్తులకాలమున నన్నివిద్యలు నెంతయభివృద్ధికివచ్చెనో యిప్పు డంతతగ్గెను.

ప్రజల మతమునందు గొప్ప మార్పులు జరిగెను. చాల శతాబ్దములు దేశమున నాదరింపబడిన బౌద్ధ మతము కలహముల వలనను, గొప్ప మతప్రచారకులు లేక పోవుటవలనను క్షీణించుచు వచ్చెను. హిందూమతము బౌద్ధమతసంపర్కమువలన గొంత సంస్కరింపబడి నూతన రూపమున బ్రజ్వరిల్లసాగెను. మతమున చిత్రలేఖనమునకు జోటివ్వని మహమ్మదీయు లాధిపత్యమును వహించిరి. ఈ కారణముల వలన బౌద్ధులచే ముందుకు తేబడిన చిత్రలేఖనము బౌద్ధమతముతోపాటు క్షీణించుట యేకాక వేరు రూపముననైనను మరల లేవజాలకపోయెను. హిందూమతము చిత్రకళను బ్రోత్సాహపరచుననైనను ఈ విషయమున నట్టి యుత్సాహమును కలిగింపజాలక పోయెను. చిత్రకళ కుంచెలను, వర్ణములను బరిత్యజించి, యినుప పనిముట్టులను, శిలలను సహాయముగా గొనెను. ఎలిఫెంటా, ఎల్లోరా, బోరొబుదరు లందలి శిలానిర్మాణ

ములను జూడ హిందూమత మెట్టి చిత్రకళాప్రోత్సాహ కారియొ గోచరించును. ఇట్టి మహాశిల్ప లీ కాలమున నుండుటయు చిత్రకళ పూర్తిగ మాయము కాలేదను టకు మరియొక నిదర్శనము.

హిందూదేశమున చిత్రరచన యున్నతదశయం దుండుకాలమున నలువైపులనున్న దేశముల కన్నిటికిని వ్యాపించెను. ఈ కాలపు చిత్తరువులు మాతృదేశమున గానరాకపోయినను తురుష్కస్థానము, టిబెత్తు, నేపాళ ములందు హిందూవిధానములను, తత్తద్దేశీయరుచులను అను సరించి మార్పుజెంది యభ్యసింపబడెను. వీటిని బరిశీలించిన నీ కాలపు హైందవచిత్రరచననుగూర్చి మనకు గొంత బోధపడగలదు.

౧౮౯౬ వ సంవత్సరమున డాక్టరు సైయిన్, గ్రున్ వెడెల్ పండితుడు, డాక్టరు లీకాక్ చైనాకు జెందిన తురుష్కస్థానమునందలి 'టాక్లమాకెన్' యెడారి యం దిసుకచే గప్పబడియుండిన పురాతన సౌధములను గని పెట్టువరకు నే యాధారములును లేకయుండెను. వీటి యందు లభించిన వివిధభాషలగ్రంథములందు పెక్కు చిత్త రువులు కలవు. వీటిని పండితు లింకను పూర్తిగ బరీక్షింప

లేదు. కాని యివియన్నియు ఏడు, ఎనిమిది శతాబ్దము లకు జెందినవనియు, చిత్తరువులలో నధికాంశ మజంత విధానముల ననుసరించియున్నవనియు, నిందు గ్రీకు, హైందవ, పర్షియను, చైనీయ నాగరికతలు మేళవించెనని యు జెప్పవచ్చును.

చైనా పర్షియా దేశములందు హైందవకళ యెట్టి మార్పులను జెందెనో 'డండన్-ఉయిలిక్' నందలి చిత్తరువులవలన స్పష్టముగ దెలియగలదు. అచ్చట నిర్మాణము లన్నియు క్రీ. త. ౭౯౧వ సంవత్సరమున జనశూన్యము లైనందున నీచిత్తరువు లాకాలమునకు బూర్వము వ్రాయబడినవగుట నిశ్చయము.



ఇరువురు పురుషులు గుఱ్ఱముమీదను, లొట్టియ మీదను గూర్చొనియున్న టులు గలదు. అవలోకితేశ్వరుని తాంత్రిక చిత్రము తిబెత్తు దేశీయుల చిత్రనిర్మాణవిధానమును తెలియజేయును. పర్షియా దేశపు చతుర్భుజ బోధిసత్త్వవిగ్రహమున భావము, నాలుగు భుజములు హైంద

వములై యుండ చిత్రరచన స్పష్టముగ పర్షియా దేశమునకు జెందియున్నది. ఇచ్చట గల జలకన్యక అన్నిటిని మించిన సుందర మైన చిత్తరువు. ఖొటాను భూములను సారవంతములుగ జేయుటకు విధవ యైన నాగులరాణి నొకమంత్రి వివాహమాడెనని హు అన్ త్సాంగు వ్రాసెను. ఈ కథ యీ చిత్రమునకు జెందినదై యుండవచ్చును. చిత్రలేఖనము, అలంకారములు అజంత చిత్తరువులను బోలియున్నవి. ముఖముమాత్రము చైనీయము. దీనిప్రక్క నున్న యిరుపురుపురుషుల చిత్రములును, వెనుకభాగమున నున్న బుద్ధునివిగ్రహమును నిస్సంశయముగ హిందూదేశమునకు జెందినవి.



పూర్వకాలమున చైనాదేశపు రాజకన్యయగు ఖొటానురాణి తన శిరోజములందు పట్టుపురుగుల గూళ్లను

దాచి తన రాజ్యమునకు దెచ్చెనని యొక కథ కలదు. ఈ రాణియొక్క చిత్రము వెడల్పు రేఖలతో మోటుగ వ్రాయబడి యున్నను సుందరముగ నున్నది.



తొమ్మిదవ శతాబ్దమున పాడైన 'ఇదికుత్తేషాహ్రి' నగరప్రాంతమున చైనాదేశీయులు బౌద్ధసన్న్యాసుల నందరిని జంపివైచిరి. ఇచ్చట లీకాక్ గారు కొన్ని చిత్తరువులను సంగ్రహించిరి. ఈ చిత్రములవంటి విప్పటికిని తిబెత్తున వ్రాయుచున్నారు.

యార్ఖోటా యందును, చిక్కన్ కోల్, టొయోఖ్ లందును లభించిన చిత్తరువులన్నియు హైందవ విధానముల ననుసరించి యున్నవి.

భారత చిత్రరచన మొదట ఖోటానుకు వ్యాపించెను. అచ్చటనుండి కొరియాద్వారా జపానును ప్రవేశించెను. కబోధ, ధర్మకుశయను నిరువురు భారతసన్న్యాసులును, అటుపిమ్మట ౬౦౫-౧౭ సంవత్సరములలో చైనా నేలిన యాంగ్టి చక్రవర్తియొక్క దర్బారున నుండిన 'బజ్న'

యను చిత్రకారుడును, ఈతని కుమారుఁడగు 'వెయిఛిమై సాంగ్'ను ఈ విధానము లచ్చట వ్యాపించుటకు కారకు లైరి. బజ్నయు, నాతని కుమారుడును బౌద్ధ చిత్రకారులుగ ప్రసిద్ధివహించి యుండిరని చైనాదేశపు విమర్శకుల యభిప్రాయము.

ఈ చిత్తరువు లన్నిటియందును రేఖ ప్రధానమును వహించెను. జపాను చైనాలందు చిత్రలేఖన మంతకుముందు లేదని చెప్పజాలము. బ్రిటిషు మ్యూజియమునందు గల నాల్గవ శతాబ్దమునకు జెందిన 'కుకయెచిహొ'చే రచింపబడిన చిత్ర మిట్టి యూహకు తావీయదు. కాని హిందూవిధానములు బౌద్ధమత సహాయమున నీ దేశమునందు వ్యాపించి యాదరింపబడి పురాతన దేశీయ కళను చాలవరకు మార్చగలుగుట నిశ్చయము.

ఇతర మతములనుండి హిందూమత మనేకాంశములను గ్రహించెను. ఇటులనే హైందవకళ యెంత గొప్పదైనను పరదేశ రచనను నీరసభావమున నిరాకరింపలేదు. గ్రీకువిధానములు గాంధారశిల్పమున గానవచ్చుచున్నవి. అజంతయందు చైనావిధానములు కొంతవరకు గలవని కొందరి యభిప్రాయము.

దగ్గరగనున్న తిబెత్తు నేపాళములందు హైందవ కళ యెటులు విజృంభించెనో యిక జూతము.

చిత్రకళ నభ్యసించునంతటి యభివృద్ధి తిబెత్తు చెందకపూర్వమే నేపాళము హిందూవిధానముల నభ్యసించెను కాని యిప్పుడీచిత్తరువు లంతగా లభించుట లేదు.

ధనార్జనమునకును, ప్రార్థనకును తిబెత్తునం దిప్పటికిని చిత్రరచన విశేషముగ జరుగుచున్నది. గోడల మీదను, కాగితముల మీదను వ్రాయబడుచున్నను 'టంకా'లను పతాకములమీద విశేషముగ చిత్రములు కానవచ్చుచున్నవి.

ఈ చిత్తరువులం దెక్కువ ప్రత్యేకనియమ బద్ధములుగ వ్రాయబడును. ఒక సమకోణ చతుర్భుజమును వ్రాసి దానిని నిడివిగీతలవలనను, అడ్డుగీతలవలనను అనేక సమభాగములుగ విభాగించెదరు. ఇందే యేభాగమున నేయే యంగ ముండవలెనో యటులు నియమము దాటక విగ్రహమును వ్రాసెదరు. ఇట్టివి భావోదయమునకు దావీయకపోయినను వర్ణలేపనమున ప్రసిద్ధిచెందుచున్నవి. రంగులు గాఢముగను, పొందికగను ఉండును. నీలియు, నలుపును

కలియుచోట లేపనము మనోహరముగ నుండును. హైందవాచారానుసారము వివరము లన్నియు నతిస్పష్టముగ గానవచ్చును.

చిత్రప్రదర్శనశాలలందు గల పతాకములం దెక్కువ పదునేడవ శతాబ్దము, తరువాతి కాలమునాటివైనను, 'చ్యు-జు'నందు లీకాక్ గారికి లభించినవిమాత్ర మెనిమిదవశతాబ్దము నాటివి. ఇంతకు బూర్వముకూడ నిట్టి పతాకములపైని చిత్రరుపులను రచించుచుండిరనుటకు నిదర్శనములు కలవు. బ్రిటిషు మ్యూజియమునందు గల పట్టుపతాకములన్నియు మంచిస్థితియం దున్నవి. ఇవి బౌద్ధమతమునకు జెందినను, చిత్రరచనయందు చైనా చిత్రములను బోలియున్నవి. తక్కిన పతాకములందువలె వీటియందును వర్ణలేపనము మనోహరము. నూలుతో నల్లబడిన పతాకము లనేకములు కలవుగాని ఇవియంత సుందరముగ లేవు. ౧౧.వ శతాబ్దమున నాలంద్మయందు బుద్ధుని బోధిసత్వుల చిత్రములను బట్టలపై జిత్రించిరని కలదు కాన హిందూదేశమునందు నిట్టివి వ్రాయుటయు గలదని చెప్పవచ్చును.

బౌద్ధమత పతన కారణములలో జారత్వమొకటి. గౌతముడు మరణించిన కొలదికాలమునకే బౌద్ధమతమున

నీ యవగుణము ప్రవేశించె నని మధుర యందలి శిల్పములు చాటుచున్నవి. ఈ జాతికి జెందిన చిత్తరువు- బుద్ధుడు కాళిని కౌగలించుకొనునటులు - ప్రాన్నునందు గలదు. ఇది కడు హేయమైనది.

ఈ చిత్తరువులందు రూపచిత్రములు (Portraits) చాల సుందరమైనవి కలవు. ఇందు తిబెత్తు లామాలచిత్రములు రెం డెంచతగ్గవి.

రష్యాకుజెందిన మంగోలియాయందు కూడ బౌద్ధ చిత్రములు భారత కళావిధానముల ననుసరించి చిత్రింపబడెను. హిందూదేశమున "క్షితిపతి" యనియు, చైనాయం "దాయుస్సునిచ్చు దేవు"డనియు, జపానునందు "సౌఖ్య ప్రదాత"యనియు ప్రసిద్ధిగాంచిన వృద్ధుని చిత్తరువును, పూర్వజన్మమున బుద్ధు డొకరాకుసిదై యనేకులను జంపి తుదకు పశ్చాత్తప్తుడయ్యెనను కథను తెలియజేయు చిత్తరువును ఇందు ముఖ్యములు.

ఈకాలపు బౌద్ధచిత్రము లించుమించుగ నన్నియు నిర్జీవగుటచేతనే వీటియందు జీవకళతక్కువగనున్నది. వేలకొలది సంవత్సరములొకేవిధముగ వ్రాయబడు చిత్రములు వేరువిధముననుండుట యసంభవము. కాలము ననుస

రించి మారుచుండు భారతీయ చిత్రరచన విదేశములందు పాదుకొనినను, ఎక్కువసత్వమును జూపజాలకపోయెను. దీనికి ముఖ్యకారణ మాందేశములందలి కళాభ్యాసకుల భావ శూన్యతయై యుండవచ్చును.

ఇప్పుడు కానవచ్చు సనాతన నేపాళ చిత్రము లన్నియు తిబెత్తు చిత్రములను బోలియుండును. ఇవన్నియు బౌద్ధమతమునకు జెందినవి. ఫ్రాన్సునందు దిట్టచిత్తరువులు పది కలవు. మత్స్యేంద్ర లేక పద్మపాణియను మారుపేరులు కల యవలోకితేశ్వరు నారాధించు భక్తుల యుత్సన మును తెలియజేయునది యందు ముఖ్యము. ప్రకృతిదర్శన జ్ఞానము దీనియందు కానవచ్చుచున్నను, హైందవ కళా చర్చయందిది యెవ్విధమునను ఉపయోగకారి కాదు. ఇది కాక తాంత్రికచిత్రము లనేకము లున్నవి. వీటియందు చిత్ర కారుని అలంకార జ్ఞానము గోచరించుచున్నను, కళాజ్ఞా నము మాత్రము కాన్పింపకున్నది.

కలకత్తాయందును, కేంబ్రిడ్జియందును రెండు పురాతన గ్రంథములు కలవు. వీటియందలి చిత్తరువులు గణింపదగినవైనను విమర్శన కాగజాలవు. వీటి కాలమును నిర్ణయించుట సాధ్యము కాకున్నది. ఇది పదునొకండవ

శతాబ్దమునకు జెందినయెడల తారానాథుడు చెప్పిన ధీమ నుని పశ్చిమవిధానములకు జెందినవై యుండవచ్చును. కేంబ్రిడ్జి గ్రంథమున సింహళద్వీపపు జంబాలుని (ధనదేవ్రుడు) చిత్రమొకటి కలదు. స్పష్టముగ నిది భారతదేశమునకు జెందును.

సింహళమునందు పూర్వము పెక్కుచిత్తరువులుండెను. పండ్రెండవ శతాబ్దమున 'పలొన్నారువ' యందలి 'మహా దమమశాయ' దేవాలయపు గోడలమీద కొన్ని జాతక కథలు చిత్రింపబడెను. వీటికాలమును నిశ్చయముగ జెప్పుట సాధ్యముకాదు. బహుశః 'పండ్రెండవ శతాబ్దము నకు పూర్వము 'నిస్సంక మల్లరాజు' సీగిరియ చెంతనున్న 'దంబుల్లి' శిలాదేవాలయమును బాగుచేయించినప్పుడిందు గల చిత్తరువులు వ్రాయబడెను. ఈ దంబుల్ల దేవాల యమునందు విజయుడు సింహళమునకు వచ్చుట, మహేంద్రుని మతబోధ, దుత్తగామిని ఏలాలల పోరాటమును గూర్చిన చిత్తరువులు సుందరమైనవి కలవు.

---

# ఏడవ అధ్యాయము

---

మొగలు చిత్రలేఖనము ౧

ఎనిమిదవ శతాబ్దమునుండి అక్బరు చక్రవర్తి సింహాసనమునలంకరించువరకు—అనగా సుమారు తొమ్మిది వందల ఏండ్లకాలమున—భారతదేశమున వ్రాయబడిన చిత్తరువులు లభించుటలేదు. ఈ కాలమున చిత్రకళ దేశమున మరుగుపడెనని చెప్పజాలము. చిత్రలేఖనమున నెట్టి యభ్యాసమును లేని భారతీయులు అక్బరు కాలమున 'అబ్దుల్ సమదు'గారి చిత్రరచనావిధానములను గ్రహించి వారితో సమానులగుట యసంభవము. తమకు నూతనమైన విదేశపు విధానము నంత సులభముగ గ్రహించుటకు వీరు స్వదేశవిధానములందు విశేషముగ ననుభవమును కలిగియుండవలెను. ఇది యూహామాత్రముకాదు. కహార్ అను పల్లకీమోయు జాతికి జెందిన దశ్వంతు అను చిత్రకారుడు జన్మము వలని ప్రతిబంధకముల నన్నిటిని జయించి అక్బరు చక్రవర్తి దర్బారున చిత్రకారుడుగ

ప్రసిద్ధికెక్కుట దీనికి ప్రబలనిదర్శనము. ఒకనాడు చక్రవర్తియొక్క దృష్టి దశ్వంతుమీద పడెను. వెంటనే అక్బరీతని ప్రవీణతను గ్రహించి 'అబ్దుల్‌సమద్'గారి కప్పజెప్పెను. కొలదికాలమున నీతడు తక్కిన చిత్రకారులనందరిని మించుటయే కాక జీవితకాలమునంతను చిత్రరచనయందే గడపెను. కాని యీతడు కాలమున నున్మత్తుడై యాత్మహత్య గావించుకొనెను.

అక్బరు పర్షియా చిత్రలేఖనమును భారతదేశమున ప్రవేశపెట్టకపూర్వము కాశ్మీరమున నీకళ యభ్యసింపబడుచుండెననుటకు వస్త్రముమీద వ్రాయబడిన పెద్ద చిత్తరువు లిరువదినాలుగు లభించెను. 'తబ్రిజ్' నివాసియగు 'మీరా సయ్యద్ అలి'చే రచింపబడిన చిత్తరువుల నివి పోలినవి. ఇవియన్నియు యుద్ధమును తెలియజేయును. వీటి చరిత్ర యెట్టిదో తెలియక పోయినను అక్బరు సోదరుడగు 'హైదర్ మీర్జాదగ్లక్' కాశ్మీరము నేలుకాలమున నివి చిత్రింపబడినవి. కాన క్రీ. త. ౧౫౪౦-౧౫౫౧ సంవత్సరముల నాటివనిమాత్రము చెప్పవచ్చును.

అక్బరుకాలమున మొగలుచిత్రరచన ప్రారంభమై, తరువాతి యిరువురు చక్రవర్తుల కాలమున ప్రబలి, పిమ్మట

క్షీణించుటచే దీని కాలము చాల తక్కువ. భారతదేశ మున జన్మించుట కాని, పెరుగుట కాని జరుగకపోవుటచే హైందవచిత్రరచనకును, దీనికిని గల సంబంధ మల్పము. అజంత చిత్తరువులును, పర్షియా చిత్తరువులును ఒకే దేశ మున వ్రాయబడెనని యిచ్చటి పరిస్థితులు తెలియనివారు నమ్మజాలరు. ఇది భారతదేశపు చిత్రలేఖనచరిత్ర కంతగా చెందకపోయినను, ఇందు గణనకువచ్చినవన్నియు నిచ్చట వ్రాయబడుటవలనను, భారత చిత్రకళ అనేకవిధ ముల దీని ననుసరించి మారుటవలనను కొంత చర్చించుట భావ్యము.

చిత్రరచన చైనానుండి రష్యాతురుష్కస్థానముల ద్వారా పెక్కుమార్పులను చెంది పర్షియాలో ప్రవేశించు టచే నిందు ఇప్పటికిని మంగోలియా చిహ్నములు కలవు.

తైమూరిద్ రాజులు భోగేచ్ఛ కలవారు. లోక మిచ్చు సౌఖ్యముల నన్నిటిని ఎట్టి జంకును లేక యనుభ వించిరి. చిత్తరువులును వీరి యానందముకొరకు నుపయో గింపబడినవి. కాన పదునైదవశతాబ్దమున పర్షియాయం దిది యింతయున్నతదశకు వచ్చెను. మొగలు చిత్రలేఖన మను పేర పిలువబడునది దీని శాఖయని చెప్పవచ్చును.

## ఏడవ అధ్యాయము

తైమూరువంశపు రాజులలో నొకడగు తైమూర్లేను హిందూదేశమున చక్కని నిర్మాణములను పాడుచేసెను కాన వీరిక్రింద కళ యభివృద్ధిపొందుట యసంభవమని కొందరు భావింపవచ్చును. ఈతడు మూర్ఖుడైనను ఈతనివంశమువారు కొంత నాగరికులై యుండిరని పర్షియా దేశపుచరిత్రయందు గలదు.

పదునాల్గవ శతాబ్దమున జెంగిస్ఖాను రాజ్యము నేలినప్పుడు వ్రాయబడిన చిత్తరువులు కొన్ని లండనునందు కలవు. ఇవి చక్కని రంగులతో నాహ్లాదకరముగ నున్నవి. ప్రకృతి భక్తిపూర్వకముగ బ్రదర్శింపబడెను. చైనా కళ యొక్క చిహ్నములుమాత్ర మన్ని చిత్తరువులందును కనబడుచున్నవి.

మూగయగు ఉస్తాద్ గంగు యొక్క శిష్యుడును, ఖురాసానునం దుండిన హుస్సేను సుల్తానుయొక్క యాశ్రితుడును అగు బిహ్జాద్ ఈ చిత్రకారులలో ముఖ్యుడు. ఈతడు మంగోలియా విధానములను చాలవరకు మార్చి తనశిష్యుల సహాయమున పర్షియా చిత్రరచనకు నూతన సౌందర్యమును దెచ్చెను. వర్ణలేపనములో నీతని మించినవాడు లేడని జేబరుచక్రవర్తి వ్రాసెను. ఈతని శిష్య

లలో 'మీరక్' వన్నెకెక్కెను. పర్షియారాజగు 'షాతహ్మస్ప' కొరకు వ్రాయబడిన 'ఖామ్సాయె నిజామీ' యను గ్రంథమున మీరక్ వ్రాసిన చక్కనిచిత్ర మొకటి కలదు. ఇందు ప్రకృతి బాగుగ లేదు కాని పులులు మొదలగు మృగములుమాత్రము చాల అందముగ నున్నవి.

ఈ చిత్రకారుల విధానములనే అక్బరుచక్రవర్తి భారతదేశమున బ్రవేశపెట్టెను. సంపాదించిన రాజ్యమును స్థిరపరచుకొనుటయందును, క్రొత్తరాజ్యములను వశపరచుకొనుట యందును మొగలుచక్రవర్తులు సదా నియుక్తులై యుండినను, వీలగునప్పుడెల్ల చిత్రలేఖనమును, తక్కిన కళలను ప్రోత్సాహపరచుచు వచ్చిరి.

బేబరు చక్రవర్తి జీవనమంతయు కష్టములలో గడపుట కలిగెను. కాన తన కళాభిరుచి నంతగా కార్యరూపమున బెట్టజాలకపోయెను. అక్బరు పాలన మన్నివిధముల మొగలు రాజ్యకాలమున నుత్తమమైనది. దేశమున శాంతి కలుగుటచే లలితకళలు ముందుకు వచ్చెను. చిత్రలేఖనమునం దీచక్రవర్తికి మిగుల నభిలాషయని 'అబుల్ ఫజల్' తన 'అయినీ అక్బరీ'యందు వ్రాసెను. రాజపోషణ కలదని విని దేశదేశములనుండి చిత్రకారులు

ఢిల్లికి వచ్చి తమ ప్రవీణతను చాటించుచుండిరి. హిందూ మహమ్మదీయ భేదమును పాటింపక కళాప్రవీణుల నందరిని సమభావమున అక్బరు మన్సబ్దారులు అనగా తన కొలువున ముఖ్యమగు ఉద్యోగులుగ నియమించి, మంచి వేతనముల నిచ్చుచుండెను. ఇట్టివారు సైన్యమునందును, రాజకీయమునందును అధికారులుగ బరిగణింపబడి గౌరవమును బొందుచుండుటచే నుత్సాహముతో బనిచేసి తమపోషకుని మెప్పింపజూచుచుండిరి. పుస్తకములసంపుటములు గట్టెడి బంగారు, వెండిపూతల బూసెడి, తక్కిన పనులను జేసెడి పనివాండ్రందరు సైనికులతో సమానులుగ నెంచబడుచుండిరి. సౌఖ్యముగ గాలయాపనము జేయుటకు చాలునటులు వీరికి వేతనములు లభించుచుండెను. వారమున కొకమారు చక్రవర్తి వీరిపనులను స్వయముగ బరీక్షించి తగురీతిని బహుమతుల నిచ్చుచుండెను. హైందవులకు క్రొత్తయగు నిజామి మొదలగు మహాగ్రంథములను వ్రాయుటకు 'బసవన్, దశ్వంతు, కేశుదాసు' మొదలగు హిందూచిత్రకారులను నియమించుటయం దా చక్రవర్తియొక్క హృదయవైశాల్యము తెలియగలదు.

చిత్రకళను ప్రోత్సాహపరచుటయందు జహాంగీరు అక్బరును మించెను. తన పోషణక్రిందనుండిన చిత్రకా

రుల చిత్తరువులను జూచి యాతడుప్పొంగుచుండెను. పదునేడవ శతాబ్దపుప్రారంభమున మొగలుదర్బారును తిల కించుటకు వచ్చిన యైరోపీయ లీతనికిగల చిత్రకళాభిమాన మును పొగడుచు వ్రాసిరి. జహంగీరొకానొక రూపచిత్ర ముయొక్క ప్రతుల నైదింటిని వ్రాయించి 'సర్ థామస్ రో' గారికి చూపించెను. మూలమునకును, ప్రతులకును వ్యత్యాసము వీరు కనుగొనజాలక పోయినందుకు చక్రవర్తి బాలునివలె నానందించి, "మేము మీరనుకొనునంత చేత కానివారము కాము" అనుచు నొకచిత్రమును కాగిత మున జుట్టి, యొక గ్రంథమునుంచి ఇంగ్లండున బ్రద ర్శింపుడని యిచ్చెను. వేటనుజూపు చిత్రములను, వింత జంతువుల చిత్రములను ఈకాలమున విశేషముగ వ్రాయు చువచ్చిరి. ఇప్పటికే భారతదేశమునకు వచ్చుచుండిన ఐరోపీయనుల చిత్రము లనేకములు కానవచ్చుచున్నవి. ఇట్టి పోషణక్రింద చిత్రలేఖన మభివృద్ధిబొందుట యొక వింతకాదు.

బౌద్ధుల చిత్రలేఖనము క్షీణించినపిమ్మట శిల్పమా న్నత్యమును వహించినటులు జహంగీరుతో మొగలు చిత్ర లేఖనము క్షీణించి మొగలు శిల్పము వృద్ధిజెందెను. ఆగ్రాయందలి తాజ్‌మహలు మొదలగు మహానిర్మాణ

ములందు షాజహానుచక్రవర్తి నియుక్తుడగుటవలన చిత్ర లేఖనమునకు ప్రోత్సాహము తక్కువయయ్యెను.రంగులు, పొందిక యీకాలపుచిత్రములందు బాగుగ నున్నను పటుత్వము మాత్రము లేదు. ఇప్పుడే 'షిల్లీకలమ్' అను చిత్ర రచనావిధానము ప్రారంభమయ్యెను.

షాజహాను యొక్క వార్ధక్యమున రాజ్యము కొరకాతని నలుగురుపుత్రులు పోరాడజొచ్చిరి. ఇందు వలన గలిగిన యశాంతిలో నీకళ వాడెను. కపటియైన ఔరంగజేబునకు లలిత కళలందు కొంచెమైనను అభిరుచి లేక పోవుటవలన నుద్యోగులందుగల యభిమానము గూడ సన్నగిల్లెను. ఔరంగజేబు దక్షిణమును జయింప వచ్చినప్పుడు మొగలు చిత్రరచన కొంతవరకు దక్షిణమున వ్యాపించి 'దక్కనికలమ్' అను శాఖగ నేర్పడెను. ఈ చక్రవర్తియొక్క యంత్యకాలమున కొన్ని చిత్రకారుల కుటుంబములకు పాట్నా, బీహారులందు కాపురములు స్థిరపడుటవలన నచ్చటను కొన్ని మొగలు చిత్తరువులు కానవచ్చుచున్నవి.

ఔరంగజేబు మరణించిన పిమ్మట మొగలు రాజ్యము శక్తిని గోలుపోయెను. కొందరు దుర్బలురగు

చక్రవర్తులు సింహాసనము నెక్కినను చిత్రలేఖనమును పోషించుపాటివారు కాకుండిరి. విదేశము నుండి తేఁబడిన మొగలు చిత్రరచన భారతీయులను విశేష మాకర్షింపక పోవుటచే మొగలు సామ్రాజ్యముతో నిదియు నంత మొందెను. పాలకులధనమున కాశించి, వారి దర్బారు నాశ్రయించియుండిన చిత్రకారులకు ప్రజలవలన జీవనోపాయము కలుగక పోవుటచే తమకుంచెల నొకమూల బారవైచి యుదరపోషణ కితరవృత్తులందు నియుక్తులైరి. మహమ్మదీయుల కాటపట్టుగనుండిన లక్నోయందును, అయోధ్యనబాబుల క్రిందను వీరు కొంతకాలము చిత్రించిరి. పందొమ్మిదవ శతాబ్దమున ఐరోపావిధానములు దేశమున ప్రవేశించుటవలన నింకను చిత్రకారు లనిపించుకొనుచుండిన వారు ఈస్టిండియా కంపెనీదొరల రుచుల కింపుగ నుండునటు లీనూతన విధానముల నభ్యసింప మొదలిడిరి. దీనితో పర్షియా చిత్రలేఖనము భారతభూమియందు మాయమయ్యెను.

స్వర్గమునందుకాని, భూమియందు కాని కల యే వస్తువుయొక్క రూపమునైనను మహమ్మదీయులు వ్రాయకూడదని మహమ్మదీయుల మతగ్రంథమగుఖురాను నిషే

ధించుచున్నది. ఈ నిషేధమును మహమ్మదీయులు సాధారణముగ పాటించినను కొన్ని సమయములందు సరకు చేయలేదు. క్రీ. శ. ౬౮౫-౭౦౫ లలో 'ఖలీఫ్ అబ్దుల్ మల్లిక్' "జెరూసెలము'నం దొకమసీదునుగట్టించి, స్వర్గనరకముల చిత్రముల నందుచిత్రింపించెను. 'ఇస్ఫహాను'నందున్న 'జుమెయి'మసీదుగోడలపై మహమ్మదుయొక్క అల్లుడగు 'ఆలీ' యొక్కయు, 'ఫతీమ' యొక్కయు చిత్రములుకలవు. అన్ని మసీదులు నిటులుండుననిభావింపజనదు. తక్కిన ప్రార్థన మందిరములన్నియు నెట్టి యలంకారములును లేకయే యున్నవి. ఈ నిషేధము నంతగా పాటింపని పియాతెగ మహమ్మదీయులు పర్షియాయం దధికసంఖ్యాకులు కలరు గాన పూర్వ కాలమునుండియు నాదేశమున చిత్రలేఖనము వర్ధిల్లుటకలిగెను. ఈ స్వేచ్ఛ ముఖ్యముగ గ్రంథములను సచిత్రములుగ వ్రాయుటయందు వినియోగింపబడెను. మొగలుచక్రవర్తులు హిందూదేశమునపరిపాలనకు, మతమునకు నధికారులుగ నుండిరి కాన నీఖురానుసూత్రమును లక్ష్యపెట్టుట కవసరము లేకపోయెను. తమ దర్బారు నలంకరించుటకును, చిత్రలేఖనమువినియోగించుటకునువీరు నిరాటంకముగ పర్షియా ననుసరించిరి. "చిత్రలేఖనమును జూచి యనేకు లసహ్యపడెదరు కాని యట్టివారు నాకు

హితులుకారు. దేవుని గ్రహించుటకు చిత్రకారున కొకవింత మార్గమున్నటులు నాకు తోచుచున్నది. ఏలనన: చిత్రకారుడు జీవవస్తువులను వ్రాయుటయందు, వాని వివిధాంగములను వ్రాయునప్పుడు వ్యక్తిత్వమును ప్రసాదింపనశక్తుడై జీవనప్రదాతయగు దేవుని దలపవలసివచ్చును. ఇందువలన నాతని జ్ఞాన మధికమగును." అని అక్బరు చక్రవర్తి యొకానొక సందర్భమున జెప్పెను. ఈ కారణముల వలన ఔరంగజేబు తప్ప తక్కిన మొగలుచక్రవర్తులందరు చిత్రలేఖనము నాదరించు భాగ్యము కలిగెను.

యవనశిల్పము గాంధారమున భారతనేతులకు లోనై హైందవ శిల్పసముద్రమున గలసిపోయినటులు పర్షియాచిత్రలేఖనము భారతచిత్రరచనావిధానములకు లోనై యనేకములగు మార్పులనుబొందెను. మహమ్మదీయులు భారతదేశపు ప్రజలలో లీనమగురీతి నిదియువారితో భారతదేశపు చిత్రకళయందు లీనమయ్యెను. దర్బారున పర్షియాదేశపు చిత్రకారులు పొందిన ప్రోత్సాహమును జూచి భారత చిత్రకారులు నట్టిచిత్రములను వ్రాయ మొదలిడిరి. ఈ ప్రయత్నములందు రెండు రకములును మనోహరముగ మేళవించెను. మహమ్మదీయగ్రంథముల

నలంకరించుటకు అక్బరు భారత చిత్రకారులను నియమిం చుటవలన పర్షియా విధానములందు సనాతన హైందవ విధానములు జొచ్చి, నూతనచిత్రము లేర్పడి యందరి దృష్టి నాకర్షించి సకలజనామోదమునుబడసెను. మహమ్మదీయులు నిట్టి చిత్రములను వ్రాయ మొదలిడుటతో నివిసర్వ సాధారణముగ నందరు చిత్రకారుల యాదరణనుబడసెను.

భారతదేశమున శుభప్రదముగ ప్రారంభమైన నిట్టి పర్షియాచిత్రరచన తొలుత మొగలు దర్బారు నందును, ధనికుల, యుద్యోగస్థుల గృహములందునుపోషింపబడి రానురాను రూపచిత్రముల రూపమున ప్రజల యందు కొంతవరకు వ్యాపించెను. గాఢముగ బూయబడుచుండిన వర్ణములు హిందూకళాకోవిదుల చేతుల యందు లావణ్యముగ, తేలికగ, కనుల కింపగునటులు నుపయోగపడజొచ్చెను. కొన్ని చిత్రము లొకే వర్ణముతో నద్భుతముగ జిత్రింపబడెను. వెలుతురుచాయలు ప్రదర్శింపబడుటవలన ప్రజల నాకర్షించినను చిన్నవిగనుండి పర్షియా వాటివలె గానబడి జన్మస్థలమును మరిపించక యుండెను. వేట, దర్బారునందలి యుత్సవములు, సాంఘికజీవనము, రాజకీయము, ఏవైనను, ఎంతటి పెద్దచిత్రమును వ్రా

యుటకవసరము కలిగినను చిన్న చిత్రములందే యన్నియు నిమడు నటులు వ్రాయుచుండిరి. మొగలు చిత్తరువు లం దిది యొక ముఖ్యవిశేషము.

మొగలుల యుద్యోగస్థులు భారతదేశమున వచ్చి యచ్చట ప్రతినిధులుగ నుండి తమ దర్బారుల నతివైభవముతో జరుపుచుండిరి. తక్కిన యాశ్రితులతో పాటు చిత్రకారులు చిత్తరువులను వీరికి కానుకలుగ నిచ్చి బహుమతులను బొందజూచిరి. పాలకులయభిరుచులనుబట్టి యీ మొగలు చిత్తరువులు సంస్థానాధీశులయాదరణను కూడ బడయజొచ్చెను.

భారతదేశమునందు వివిధప్రాంతముల ప్రజలకు రుచులయందు వ్యత్యాసము కలదు. దేశమున ననేక ప్రాంతములందు కానవచ్చు చిత్తరువులందు ఈకారణమున భేదము కాన్పించుచున్నది. మొగలు చిత్రరచనా విధానములనెడి వృక్షమున కీవివిధప్రాంతముల చిత్రలేఖనరీతులు శాఖలవలె నున్నవి. వీటికి "కలము" లని పేరు."కలము"నకు ఉరుదూభాషయందు "వ్రాయుపరికరము" అని యర్థము. ఇందువలన కుంచెయనియు, రీతి, లేక విధానము అనియు నర్థము నిచ్చును. వీటికికల భేదము వర్ణలేపనమునందు తప్ప ఇతరవిషయములందు లేదు.

## ఏడవ అధ్యాయము

ఢిల్లీ కలము ఢిల్లీ మొగలు దర్బారునకు జెందినది. ఈ కలములలో నిదియే ముఖ్యమైనది. ఈ చిత్తరువులందు రేఖలు స్పష్టముగ నుండును.

జయపురకలమున వస్తువులపుష్టిని జూపుఛాయ ప్రాధాన్యము వహించుటచే రేఖ లంతస్ఫుటముగ గానరావు. రాజపుత్రచిత్రలేఖనమునకు నీ ప్రదేశమే ముఖ్యస్థానమగుటవలన నీ రెంటికిని గలభేదము తక్కువ.

లక్నో కలముయొక్క చిన్నచిత్రము లన్నియు నించుమించుగ ఢిల్లీకలమునకు జెందినటులుండును. కాగితముపై తెలుపురంగు నెక్కువగ వాడి చిత్తరువుల నధికాంశము నీటిరంగులతో నిచ్చట చిత్రించిరి.

డక్కన్ కలమునందలి చిత్రములు, వాటియందలి వస్తువులకూడికలును చాల చిన్నవి. అచ్చటచ్చట బంగారపు రంగును పూయుట వలన నివి ఢిల్లిచిత్తరువులను పోలియున్నను వాటికంటె సుందరముగ గానవచ్చును.

పందొమ్మిదవ శతాబ్దమున పాట్నాకలము ముఖ్యముగ వంగదేశమున బ్రబలెను. ఈ చిత్రములు తొలుత లిఖించుటయందు సుందరముగ నున్నను పూర్తియైన పిమ్మట లలితములుగ కానరావు. పనితనమున డెల్హీకల

ముయొక్క ప్రాశస్త్య మున్నను వర్ణలేపనమున మోటుగ నున్నవి.

కాశ్మీర కలమునకు వ్యక్తిత్వము చాల తక్కువ. కాశ్మీరదేశమునుండి లాహోరు మొదలగు పట్టణముల కీచిత్రకారులు త్వరలో చెదరి పోయిరి.

'కుమి'యను మఱియొకకలము కలదు. అది ఐరోపా విధానముల బోలియుండును. తమ నివాసముల నలంక రించుటకు మొగలాయి చక్రవర్తులవలనను, క్రైస్తవ మత ప్రచారకులవలనను ఇది ప్రోత్సాహపరుపబడెను.

ఆకాలమున హిందూదేశమునందేకాక పర్షియా యందు కూడ ఐరోపా చిత్రరచన మిగుల నాదరింపబడు చుండెను. ఐరోపా చిత్తరువులను వ్రాయనేర్చుకొను టకు కొందరు చిత్రకారులను ౧౫౮౭-౧౬౨౯ సంవత్సర ములలో మొదటి 'షా అబ్బాసు' రోమునకు బంపెను. రెండవ 'షా అబ్బాసు'ను ఇటులు ప్రోత్సహింప జూచెను. ఇటులు నేర్చుకొనిన చిత్రకారులలో నొకడగు'మహామ్మదు జామను పాలో జామన్' అను మారుపేరున స్వదేశ మునకు మరలుట వలన ప్రజల యాగ్రహమునకు గురియై హిందూదేశమునకువచ్చి షాజహానువద్ద మనసబుదారుగ నుండెను. ఈతడు వ్రాసిన మూడు ఐరోపా చిత్తరువులు

లభించినది. 'దారా షుకోషు' చిత్ర సమితియందు 'సెయింటు కేటెరిన డిసయోనా'యొక్కయు,'సెయింటు మార్గరిటా'యొక్కయు చిత్తరువులు కలవు. 'ఫతెహ్‌పూరుసిక్రీ'యందును, లాహోరునందను బైబిలునకు చెంది న చిత్తరువులు కొన్ని కలవు. ఆదాము కుమారుడగు ఇబ్రహీము రాజ్యమును త్యజించి విరాగి యగుటయు, దేవదూత





లాతని కాహారము సమర్పించుటయు జూపుచిత్తరువొకటి కలదు. ఇది క్రైస్తవచిత్రమని యనేకులు పొరపాటుపడిరి. ఐరోపీయనులదుస్తులనేకచిత్రములందు కానవచ్చుచున్నవి. వీటియందు చాయవెలుతురులు, ప్రకృతి మైరోపావిధానముల ననుసరించి యున్నవి. వీనిని, హైందవవిధానములను గలుపుట యవివేక మని కొందరి యభిప్రాయము. కాని యీకాలమునాటి యిట్టి చిత్రములు కొన్ని చాలబాగుగ నున్నవి.

---

# ఎనిమిదవ అధ్యాయము

## మొగలు చిత్రలేఖనము ౨

అక్బరు చక్రవర్తి మతభేదమును పాటింపక చిత్రకళతో సాహిత్యమునకుకూడ చేయూతనొసగెను. అనేక మతములవారిని బిలిపించి వాదనలను సలుపుచుండెను; కవులకు బహుమతుల నొసగుచుండెను. ఇట్టి సానుభూతి వలన ఆగ్ర, ఢిల్లి మొదలగు నగరములందు గ్రంథాలయములు నెలకొల్పబడెను. ప్రాగ్దేశపు గ్రంథరాజముల నన్నిటిని చక్కగ వ్రాయించి, చిత్తరువులనుజేర్చి సంగ్రహించుటచే మన కిప్పుడనేక చిత్రములు లభించు భాగ్యము కలిగెను. జయపురమునందున్న 'రాజంనామా'యను మారు పేరుకల మహాభారతసంగ్రహమును; వాషింగ్టనునందున్న రామాయణమును, సౌత్ కెన్సింగ్టనునందున్న అక్బరు నామా యందలి ౧౧౭ చిత్తరువులును దీనికినిదర్శనములు.

అక్బరు తదనంతరము జహాంగీరు, షాజహాను, ఔరంగజీబు, రెండవఅక్బరు, మీార్ మహమ్మదు, షాఆలమ్,

రోహిల్‌కండు ప్రభువగు హాఫీజ్ రహమత్, అయోధ్య ప్రభువగు అసఫుద్దౌలా మొదలగువారు నీగ్రంథాలయ ముల నాదరించుచుండుట వలన నూతనచిత్రములు చేర్పబడుచుండెను. కాని మొగలాయిప్రభుత్వ మంత మొందు కాలమున దేశమునగలిగిన సంక్షోభమునం దీ చక్కని గ్రంథకూటములు నాశనమయ్యెను. నశించగా మిగిలి ప్రపంచమునం దచ్చటచ్చట కానవచ్చుచున్న గ్రంథ ములందలి చిత్తరువులు మనకిప్పుడు మొగలుచిత్రరచనను విమర్శించుటకు ముఖ్యాధారములుగ నున్నవి.

బసవన్, దశ్వంతు మొదలగు సుప్రసిద్ధ చిత్ర కారులచే చిత్రింపబడినవైనను గ్రంథములందు కానవ చ్చెడి చిత్రము లంతగా ప్రసిద్ధములుకావు. కాని చిత్తరువు లను వ్రాయుటయందు చిత్రకారులకు విశేషము స్వేచ్ఛ లేకుండుటచే విడిగ లభించిన చిత్తరువుల మించియుండ జాలవని విమర్శకుల యభిప్రాయము. ఇట్టి చిత్తరువులు చిత్రసంపుటము (Album) లందు మనకు లభించుచున్నవి. షాజహానుచక్రవర్తి కుమారులలో నొకడగు దారాషు కోషు గృహకలహములవలన గలిగిన యుద్ధమునం దోడి పోయి పలాయితు డగుచుండ త్రోవలో దప్పిగొని నీరు దొరకక తనభార్య మరణించె నని విని దుఃఖితు

డమ్యెను. ఆమెను స్మరించుట కీనిర్భాగ్యుడొకచిత్రసంపుట మును సమకూర్చి యామె కంకితమిచ్చెను. ఇది యిప్పుడు 'దారాషుకోషు చిత్రసంపుట' మను పేర ప్రసిద్ధిచెంది యు న్నది. హాఫీజ్ రహ్మత్ వద్ద మరియొకసంపుట ముండెను. మొగలుసామ్రాజ్యమునాశమొందినపిమ్మట మహారాష్ట్రుల కాలమునగూడ చిత్రరచన కొంతవరకు నిరాటంకముగ జరుగుచుండుటవలన నిట్టి సంపుటములు పూర్తిగ నశింప లేదు. ఆంగ్లేయులు భారతదేశమును జయించుకాలమున కంపెనీవారి యుద్యోగస్థులకును, సైనికులకును చిత్తరువుల నేకములులభించుటవలన వానిని తమస్వదేశమగు ఇంగ్లండు నకు గొనిపోయిరి. వానియందును కొన్ని నశించెను. మిగి లిన విచిత్రప్రదర్శనశాలలు మొదలగు సంస్థలను జేరెను.

ఈ కాలమునను హిందువుల యాచారము ననుస రించి గోడలమీదను చిత్తరువులను వ్రాయుటకలదు. ఆగ్రాకు సమీపముననున్న 'ఫతెహ్‌పూర్ సిక్రి'యందలి అక్బరు పడకగదియందును, 'మేరియముజ్ జామను'అను పేర బిలువబడిన యాతని హిందూభార్యయొక్క నివాసము నను కుడ్యచిత్రములు కలవు. నలుబది యేబది సంవత్స రములకుపూర్వ మిందు కొన్నిమంచిస్థితియం దుండినను ఇప్పుడవి చాలవరకు చెడిపోయినవి.

చిత్రసంపుటములందును, గ్రంథములందును, ఎన్ని రకముల చిత్రము లుండెనో యీ గోడలమీదను అన్ని రకముల చిత్రము లుండెను. ఇప్పటికిని బౌద్ధమతచిత్రములు మొదలుకొని జపానువారిరీతిని పుష్పములవరకును గలవు. రెక్కలుకల దేవదూతల చిత్రము లుండుటవలన సుమారు ౧౫౭౦ వ సం.మునందే ఐరోపాచిత్రముల నీచిత్రకారులు చూచినటులు కనుపడుచున్నది. బుద్ధుని రూపచిత్రము చైనా విధానములను స్మరింపజేయును. అక్బరు ప్రపంచము నందున్న యన్నిమతములవారిరుచులను చవిజూచెను.

పదునెనిమిదవ శతాబ్దానంతరము జానుస్మాట్సు, ఒజియాస్, హంఫ్రీజ్ మొదలగు చిత్రకారులు హిందూదేశమునకు వచ్చి దంతముమీది చిత్రములను రాజగృహాములందు ప్రవేశపెట్టిరి. వీటినిజూచి యిట్టిచిత్రములను ఢిల్లియందు వ్రాయ ప్రారంభించిరికాని వీటియందు భావప్రదర్శనమేమియు గానరాకున్నది.వీరు ప్రసిద్ధిచెందినచిత్రముల ప్రతులను దీయుటతో తృప్తినొందినట్లు కానవచ్చుచున్నది. (చూ. ౧౩౭ పు.)ఇట్టిప్రతులందు ఉత్తమమైనవి రచనాచమత్కృతినిజూపుచునాహ్లాదపరుపగలవుకాని భావముయొక్క “పొంగు” లేకపోవుటచే కళాభాగములుగ గణింపబడజాలవు.



తైమూరుషా సముఖమున కైది సుల్తాను బెయజిద్

యన్. సి. మెహత గారి 'ఇండియన్ పెయింటింగు' అను గ్రంథము నుండి.

మొగలు చిత్తరువులు ప్రపంచమునందలి యన్ని విషయములగూర్చియు గలవు కాని విగ్రహారాధనను మహా



మ్మదీయ మతము సహింపకపోవుటచే మతవిషయక చిత్రములు మచ్చునకైనను కానరావు. అచ్చటచ్చట హైందవ, బౌద్ధ, క్రైస్తవ మతముల చిత్తరువులు మాత్రము కలవు.

మహమ్మదీయస్త్రీలు పరుల కంటబడరు. ఈ యా చారము వీరి పాలనలో హిందూసంఘమునందును బ్రవే శించెను. అందుచే గృహజీవనమును గూర్చిన చిత్తరువు లల్పముగలవు గాని మహమ్మదీయుల సహజముగ భోగ ప్రియులుకొన కొన్ని స్త్రీచిత్రములును, స్త్రీలుపురుషులు కలిసియుండు చిత్రములు కొన్నియును కలవు. ఒక స్త్రీ కూర్చుని సాంధ్యరాగమును జూచి యానందించు చున్న



టులు రావు గోవిందసింగు వ్రాసిన చిత్రము చాల సుంద రముగ నున్నది. 'మల్కా-జమీానియా' అను స్త్రీయొక్క చిత్రమును ఎన్నదగినది. ఒక మందిరమున నిరువురు స్త్రీ లున్నటులు మహమ్మదు ఫకీరుల్లా వ్రాసిన చిత్తరు వాహ్లా దకరముగ నున్నది. ఇట్టి వనేకములు కలవు.

రాజకీయపరిస్థితులను జూపు చిత్రములందు డిల్లిలో జరిగిన గొప్ప యుత్సవములకు జెందిన వధికాంశ మున్నవి. జహాంగీరు కాలమున పర్షియా దేశమునుండి వచ్చిన రాయ బారమునకు స్వాగత మొసగుట, షాజహానుయొక్క జన్మ దినోత్సవమును జరుపుట, షాజహాను తల్లియొక్క యొడి యందు గూర్చొనియుండుట, సుప్రసిద్ధమైన నెమలి సింహా సము నధిష్ఠించుట,యమునానది తీరమున సైన్యపరీక్ష మొదలగు చిత్తరువు లిందు ముఖ్యము. వీటివర్ణ లేపనము, బంగారుపూత మనోహరముగ నున్నవి. చక్రవర్తులకు సంబంధించినవియు, వారి దయ నార్జించుటకు వ్రాయబ డినవియు నగుటవలన నీచిత్రములందు చిత్రకారులు తమ శక్తినంతయు జూపిరి.

'తిరియ' వ్రాసిన పంక్తిభోజనము చాల బాగుగ నున్నది. ఆనందముతో మాటలాడుచు, భోజనముచేయు

చున్న వారును, ఫలహారములతో వెనుక నిలువబడిన సేవ కులును ఎవరి స్థానమున వారున్నారు. గృహము నెదుటనొక విశాలస్థలమున, భోజనము, చుట్టును ప్రాకారము, ప్రాకారము వెనుక వృక్షములు, వాని వెనుక నాకాశము, ఆకాశమున నెగురు జలపక్షులు అన్నియు నింపుగ చిత్తరువున నిమిడియున్నవి.

జహాంగీరు గురువువద్ద విద్యాభ్యాసము చేయున టులున్న చిత్తరు వతిమనోహరము. గురుశిష్యుల విగ్రహములు, గ్రంథములు, ప్రక్కను తివాసిపై నిద్రించుచున్న పిల్లియు లావణ్యముగ జిత్రింపబడినవి. దూరముననున్న గృహములు, చెట్లు, చిత్రకారుని ప్రకృతిజ్ఞానమును తెలియజేయును.

దారాషుకోషు చిత్రసంపుటమున గల "ఖొరాను చదువుట" యను చిత్రము నలుగురు మహమ్మదీయుల నత్యంత స్వాభావికముగ ప్రదర్శించుచున్నది.

పర్షియా భారత దేశముల కథలనుగూర్చి విశేషముగ చక్కని చిత్తరువులు లభించెను.

సహజముగ గల అభిరుచివలననో, తమ్ము పోషించెడి ప్రభువుల యాజ్ఞవలననో యీ కాలపు చిత్రకారులు

వేటనుజూపు చిత్రములను విరివిగ వ్రాసిరి. రెండవకారణమే నిజమై యుండును. చక్రవర్తు లెన్నిపర్యాయములు వేటకు వెళ్ళిరో యన్ని చిత్తరులు కలవని తోచుచున్నది. తాము చూపెడి బాహుబలము, ధైర్యసాహసములు చిరస్మరణీయముగ నుండుటను వేటకాంక్షులు కోరెదరు. వేటను జేయువారు చక్రవర్తులేయైన నిక చెప్పవలెనదేమి? జంతువులను జంపుట, అపాయములనుండి తప్పించుకొనుట, చిత్రరూపముగ నెదుటబెట్టి పూర్వము ప్రభువులు చేసిన పరాక్రమకార్యములను స్మృతికి దెచ్చిన బహుమతులు లభింపకుండునా? "చక్రవర్తి వేటకు వెళ్ళెను. ఒకపులి యేనుగుమీాది కురికెను. పాలకుని తుపాకియందు మందు లేకపోయెను. వాహనముగ నున్న హస్తి భయపడి పలాయనమగుటకు దలంచెను. ఆపత్తులో నుండిన ప్రభువును విడిచి సేవకుడు పరుగిడుచుండెను." ఇట్టి చిత్తరువును వ్రాయుటకు చిత్రకారున కుత్సాహముగ నుండును. ఆపదనుండి సురక్షితముగ నగరు చేరిన చక్రవర్తియు నాచిత్తరువు నానందముతో జూచును.

రూపచిత్రములందు మొగలు చిత్రరచన భారతచిత్రరచనయం దగ్రస్థానము నలంకరించును. ఇట్టిరూపచిత్రసముచ్చయము ప్రపంచమున మరి యేదేశమునను

లేదని పండితులు తలంచుచున్నారు. రాజులు, రాణులు, రాజకుమారులు, విరాగులు, సైనికులు, వేయేల? అందరును ఈరూపచిత్రముల గలరు. హైందవ చరిత్రకారులు చరిత్రపురుషుల రూపవర్ణనను జేయలేదను వాదము కలదు. ఈ కొరత హైందవ చిత్రకారుడు మొగలాయీల కాలమున దీర్చివైచెను.

రూపచిత్రములను వ్రాయుట హిందూదేశమునకు క్రొత్తకాదు. చిత్రరేఖ రూపచిత్రములను వ్రాయు చిత్రకారిణియని పురాణములందు గలదు. బుద్ధుని చిత్రములు, విగ్రహములు వేనవేలు ప్రాగ్దేశములందు గానవచ్చుచున్నవి. సీగిరియయందలి కశ్యప నృపుని భార్యలచిత్రము లెంతయో బాగుగ నున్నవి. అజంతగుహాలం దిప్పటికిని 'ఖుస్రుపర్వీజ్', 'పులకేశు'లు కానవచ్చెదరు. ఈ గుహాల చిత్తరువు లన్నియు చిత్రకారులు స్వయముగ జూచినవారి యొక్కయో, ప్రసిద్ధివలన వర్ణనలు కలవారియొక్కయో చిత్తరువులై యుండవచ్చును. ఇప్పటికిని హిందూదేశమున చిత్రకారులు విష్ణువు, రాముడు, శ్రీకృష్ణుడు మొదలగువారిచిత్రములను నియమముతప్పక పూర్వపు వర్ణనల ననుసరించి యాచారప్రాయముగ జిత్రించుచున్నారు. భారత

విధానముల ననుసరించి తిబెత్తున వ్రాయబడిన యొక చిత్తరువునందు చిత్రకారుని రూపచిత్ర మున్నది. సింధుదేశము నందు నిట్టిచిత్తరువులను వ్రాయుట యుండెను.

అక్బరుయొక్క దర్బారు నలంకరించుటకు పర్షియానుండి వచ్చిన చిత్రకారులు కొన్నిచిత్తరువులనుదెచ్చినటులు గన్పట్టుచున్నది. వీటియం దధికాంశము 'బిహ్జాదు' వద్ద చిత్రరచనను నేర్చుకొనిన సుల్తాను మహమ్మదుచే వ్రాయబడెను. క్రొత్తగ నీదేశమునకు దేబడిన యీ చిత్తరువులకు చిరకాలమునుండి కల యభిరుచి తోడ్పడుటవలన త్వరలో మొగలు చిత్తరువులందు రూపచిత్రములు మిక్కుటమయ్యెను. మహమ్మదు నాదిరు, మీరుహాషిము, మీరు మహమ్మదు, మహమ్మదు ఫజిలు మొదలగు రూపచిత్రకారుల నడుమ భగవతి, హునారు అను హిందూ చిత్రకారు లుండిరి. భగవతి పర్షియా విధానములకు దాసుడైనను హునారు మాత్రము హిందూమార్గములను త్రొక్కి కీర్తి నార్జించెను. అక్బరుచక్రవర్తియె తనరూప చిత్రమునకుగాను చిత్రకారునియెదుట గూర్చుండెననియు నట్టి చిత్రములను వ్రాయించుకొనుడని తన యుద్యోగుల నందరి నాజ్ఞాపించెననియు, ఈ కారణమువలన నిట్టి

చిత్తరువుల సంపుట మొకటి పెరిగెననియు, నిందు మరణించిన వారమృతులుగ నున్నారనియు 'అయిని అక్బరీ' యందు కలదు. ఇట్టి ప్రోత్సాహము కలచోట రూపచిత్రములు విరివిగ వ్రాయబడుట యొకవింత కానేరదు.



అజాతశత్రువు బుద్ధుని రూపచిత్రమును గోర నాతడు తన నీడ యొక వస్త్రముమీద బడునటులు గూర్చుండెను. దీనిసహాయమున చిత్రకారుడు గౌతముని రూపచిత్రమును రచించెను. మొగలు చిత్తరువు లించుమించుగ నన్నియు నిట్టి యర్ధరూప చిత్రములు (Profiles) అని చెప్పవచ్చును. పూర్వకాలపు పర్షియారూప చిత్రములందు మొగము మూడు భాగ

ములు కనబడునటులు వ్రాసిరి. రానురాను మొగలు చిత్రకారు లర్ధభాగమే కనబడునటులు వ్రాయుట కేల నియమబద్ధులయిరో తెలియకున్నది. ఇట్టి బంధము లచేకట్టుపడియు వీరు భావము, లావణ్యము, రూపమున సత్యము మొదలగునవన్నియు లోపములేక వ్రాసి శ్లాఘా పాత్రులైరి. చిత్రరచనయందు మిగుల ప్రవీణతయుండిన నే కాని ఇట్టి చిత్తరువులను వ్రాయుట సాధ్యము కాదు.

ఔరంగజేబువద్ద నుండిన ఫ్రాన్సిసు బెర్నియరు అను నొకపరాసు వైద్యుడు హైందవ చిత్రములను బొగడుచు, "హైందవ చిత్రకారులు అంగసాదృశ్యమును, ముఖభావమును బాగుగ చిత్రింపజాలరు. గొప్ప కళావిశారదులవద్ద నభ్యసించిన నిట్టిలోపములు త్వరలో పోవు"నని వ్రాసెను. ఈతని విరోధాభిప్రాయము నిజము కాదని లభించిన చిత్తరువులవలన దెలియుటయే కాక యీకాలపు చిత్రకారులు ప్రపంచమున నితర చిత్రకారుల కీవిషయములలో వెనుకబడరని సుప్రసిద్ధకళావిమర్శకు లిపు డభిప్రాయ పడుచున్నారు. చిత్రకారు లందరు ఢిల్లీ చక్రవర్తుల నాశ్రయించి యుండుటచే రూపచిత్రములం దధికాంశము చక్ర



వర్తుల చిత్రములు—ముఖ్యముగ నక్బరువి. అబుల్ ఫజల్, బీర్ బల్, రాజామాన్‌సింగు మొదలగు అక్బరు మిత్రులును కొన్ని మోటుచిత్తరువులందు గలరు. షాజహాను, ఔరంగజేబు మొదలగు మొగలుచక్రవర్తులవి కొన్ని మంచివికలవు. వీరివి వారివి అననేల? పేరుగలిగిన ధనికులయు, ఉద్యోగస్థులయు, వీరులయు చిత్తరువు లనేకములు లభించినవి.



చిత్రకారుల రచనాప్రవీణతను జూపుటకు విలువగల యాభరణములు, దుస్తులు ధరించెడి చక్రవర్తుల రూపచిత్రములందు మంచియవకాశము లభించెను. చిత్రమున సాధారణముగ నొక్కరి రూపమునే మిక్కిలి యోపికతో వ్రాయుటవలన నివి మిగుల సుందరముగ నున్నవి. బంగారుపూత యుక్తముగ వేయబడెను. కొన్నిటియందు నలుపుమధ్యను గాఢమైన రంగులతో మనుష్యవిగ్రహములు కలవు. మరికొన్నిటియం దంగములు కనబడునట్లు వేసవిదుస్తులు కలవు. ముఖము లితరభాగము కన్న చక్కని ఛాయలతో విరాజిల్లుచున్నవి. ఈ కాలమున చిత్తరువులందు ఛాయ విశేషముగ బాటింపబడక

పోవుటచే యనవసరమగు ఛాయలకు వీటియందు తావు లేదు. ముఖమునందు మనుష్యునిగుణము కనపడుచున్నదా, రూపము బాగుగ వచ్చెనా, పనితనము బాగుగ నున్నదా, అంగములు పొందికగ నున్నవాయని మాత్రము చిత్రకారులు ప్రశ్నించుకొనిరి. తక్కిన నియమములను విశేషము పాటింపలేదు.

ప్రారంభముననే విడువబడినట్టియు, సగము చిత్రించిన పిమ్మట విడువబడినట్టియు చిత్తరువులు లభించెను. వీటి సహాయమున నప్పటి చిత్రకారు లేమార్గములను త్రొక్కిరో మనకు తెలియగలదు. ఏ తరగతియం దున్న చిత్తరువులైనను సుందరముగనేయుండుట మొగలు రచన యొక్క మరియొక విశేషము.

మృదువుగ వ్రాయబడిన ముఖమునకు సమీపముననే గాఢమగు వర్ణములతో శిరోభూషణములు, కంఠహారములు సాధారణముగ నుండును కాన బంగారమున విలువగల మణి పొదిగిననుండు సౌందర్య మీచిత్రము లందు కలదు. చుట్టును నీలియాకాశము, నల్లని, పచ్చని పచ్చికపట్టులు ఉండుటవలన ముఖ్యవిగ్రహమునకు ప్రాముఖ్యము కలుగుచున్నది. స్త్రీయైన పుష్పము, చక్రవర్తియైన ఖడ్గము, విరాగియైన జపమాల ముఖ్యముగ హస్తభూషణ

ములై ఒప్పియున్నవి. అర్థముఖమే కనపడుచున్నదను చింత యీ హస్తసౌందర్యమున మాయమగును. రూపచిత్రము లందు హస్తముల కెట్టి ప్రాముఖ్య ముండవలెనో యితర దేశముల చిత్రకారు లీ చిత్రములనుండి నేర్చుకొనవలెను.

అనేకులు స్త్రీలు పురుషులు నొకేచోట నుండు నట్లు చూపుచిత్రములందు స్థలము చాలక వ్యక్తుల విగ్రహ ములను చిన్నవిగ వ్రాయవలసియుండును. ఇట్టి సందర్భ ములందు కూడ రూపము లతిజాగరూకతతో లోపములు లేక, వివరము లన్నిటితో జిత్రింపబడినవి.

అక్బరుకాలమున తామర్లేనుయొక్కయు, ఔరంగ జేబుకాలమున అక్బరుయొక్కయు చిత్రములు కావలసి వచ్చినయెడల పూర్వపు చిత్తరువుల సహాయమున నతి నిపుణతతో ప్రతులను వ్రాయుచుండిరి. రాను రా నిట్టి చిత్రముల రూపు చెడినను పూర్వరాజుల రూపములు వీటి వలన మనకు తెలియుచున్నవి. ఈమార్గమును వీ రవలం బింపక పోయినయెడల నిప్పుడు నాశనమైన తొలిరూపచిత్ర ము లెట్టివియో మనకు తెలియకపోయియుండును.

ఔరంగజేబు కాలమున రాజపోషణ తగ్గునాటికి రూపచిత్రములయెడల ప్రజలయం దనురాగ ముదయిం

చెను. కాన చౌకగ లభించు చిత్తరువులు కావలసివచ్చెను. ఉదరపోషణకే కష్టపడు చిత్రకారు లేదో యొకవిధముగ ప్రాతచిత్తరువుల ప్రతులను వ్రాయ ప్రారంభించిరి. ఇట్టి చిత్తరువులందు కళాప్రవీణత యుండుట యసంభవము. మొగలు చిత్రలేఖనము క్షీణించుట కిది యొక హేతువు.

పలుచనిచర్మముమీద సుప్రసిద్ధరూపచిత్రములను రేఖలతో వ్రాసి చిత్రకారులు సంగ్రహించుకొనిరి. వీని నొకకాగితపుముక్కపైనుంచి దిద్దుటవలన నూతనచిత్రాకృతి దానిపై నేర్పడును. దీనిపై రంగులనువేసి పూర్తిజేసి బజారునందమ్ముచుండిరి. ఇట్టివియు నచ్చటచ్చట లభించెను కాని పూర్వపుచిత్తరువులను వెక్కిరించునటులు నున్నవి.

కొన్నిచిత్రములమీద వానియందలివ్యక్తుల పేర్లను మొగలు చిత్రకారులు వ్రాయుచువచ్చిరి. ఎవరైన నొక వ్యక్తియొక్క చిత్రమును వెలకు కావలెనని కోరినప్పుడు, మొగలు సామ్రాజ్యానంతరము ఉదరపోషణకు చిత్రలేఖకులని నటించెడివారు తొలి చిత్తరువులవలె వ్రాయజాలక, వా రిదివరకు సంపాదించిన ప్రాతచిత్రములపై పేర్లను మార్చుచు విక్రయమున కర్పించుచుండిరి. ఇందువలన చిత్రములపై నున్న పేర్లపై చిత్రకారు లాధారపడజాలరు. ఏ

సంస్థ యైనను క్షీణించుకాలమున నిట్టి విపరీతములు కలుగుట సంభవము.

జహాంగీరు చక్రవర్తికి జంతువులయెడల, పక్షులయెడల ప్రేమ యెక్కు వగుటచే తనకు కానవచ్చిన ప్రతి వింత మృగముయొక్కయు, పక్షియొక్కయు చిత్రములను వ్రాయింపించుచుండెను. జగన్నాథు చిత్రించిన నెమళ్లచిత్రమును, దారాషుకోషు చిత్రసంపుటమునగల బాతు ఈ కాలపు పక్షులచిత్రముల సౌందర్యమునకు నిదర్శనములు. మన్సూరు అను చిత్రకారుడు నిట్టిచిత్తరువుల ననేకములను వ్రాసెను. ఇట్టి రచనను వీరు జపానునుండి నేర్చుకొని రా యను సంశయము కలదు.

జంతువులచిత్రములందు చాల సుందరమైనవి కలవు. లొట్టియుం చిత్రమును జూడుడు. ఒకపిల్ల పాలను త్రాగు



చున్నట్లు, మగలొట్టెను మేయుచున్నట్లు మనోహరముగ నున్నది. దూరమున చెట్లు, కొండలు, మేఘములు మొదలగునవి యనవసరముగ నిందు లేవు. 'సర్వాను' వ్రాసిన యడవిపోతు, దారాషుకోష్ యందలి చిత్రములు, పిల్లి చిత్తరువు చక్కగ నున్నవి.

చట్రములవలె చిత్రము నలువైపుల లతలను వ్రాయుటయం దీకాలపు చిత్రకారు లద్వితీయులు. ఏదేని యొక రంగును గాఢముగ బూసి దానిపై బంగారు పూతతోనైనను, మరి యేరంగుతోనైనను లతలుగ చక్కనిపువ్వులు, మొగ్గలు, ఆకులు ఉండునట్లు వ్రాసిరి. పక్షులు, సీతాకోకచిలుకలు కొన్నిచోటుల గలవు. కాని తరుచుగ నివియన్నియు నాచారప్రాయముగ నుండుటవలన బోల్చుకొనుటకు సర్వదా సాధ్యము కాదు. లతలు కొన్నిచోటుల రెండు వరుసలుగ వివిధవర్ణములతో గలవు.

బ్రాహ్మి, సంస్కృతము మొదలగు భాషలను చక్కగ వ్రాయవలెనను అభిలాష హిందువులకు కలుగలేదు. పర్షియా మొదలగు మహమ్మదీయ దేశములందును, చైనాయందును తప్ప మరియే దేశముననైన నిట్టి యక్షరలేఖన మంతగా పాటింపబడలేదు. పర్షియా చిత్రలేఖన

ముతో కూడ నిదియు హిందూదేశమున విరివిగ నభ్యసింపబడుచుండెను. ఈ రచనయం దెనిమిదివిధము లుండెననియు, నందు 'నస్టలీఖ్' అను కొంచెమువంకరగీతలతో వ్రాయబడిన రచన యక్బరునకు ప్రియమైనదనియు అబుల్ ఫజల్ వ్రాసెను. ఇందు కాశ్మీరదేశపు 'మహామ్మదు హుస్సే' నందరిని మించెను. కొందరు చిత్రలేఖనముకంటె దీనికే యెక్కువ ప్రాముఖ్యము నిచ్చుచుండిరి.

# త్రొమ్మిదవ అధ్యాయము

## మొగలు చిత్రలేఖనము 3

అక్బరుచక్రవర్తి కాలమున పర్షియావిధానములు భారతదేశమును ప్రవేశించిన కొలదిదినములకే సుమారు నూరుమంది చిత్రకారు లుండిరట! ఇట్టి శుభముతో ప్రారంభమై రెండున్నర శతాబ్దములవరకు నేదో విధమున నాదరణను బడసిన యీ కళ నభ్యసించిన వారనేకు లుండవచ్చును. జహాంగీరు చిత్రరచనను మిగుల ప్రేమించుచుండెను. షాజహాను దీని కెట్టి ప్రతిబంధకములను కలుగజేయలేదు. ఔరంగజేబునకు దీనిమెడల ననురాగము లేకపోయినను అప్పటికి ప్రజల యాదరణను బడయజొచ్చెను. మహారాష్ట్రులవలన మొగలు సామ్రాజ్యము కూలినప్పుడును, హైందవ సంస్థలందు సానుభూతిలేని యాంగ్లసైనికుల దుండగములందును, ఈ కారణముల వలన దేశమునగలిగిన సంక్షోభమునందును చిన్నరాజ్యములు కూలెను; రాజుల యాస్తులు చెదరెను; ధనికులు,

## తొమ్మిదవ అధ్యాయము

ఉద్యోగులు తలదాచుకొనుటకు పలాయితులైరి; ప్రజల యందు శాంతిలేకపోయెను; నూతన ప్రభువుల ధనాశ మెండయ్యెను. ఇట్టికాలమున చిత్తరువులనుగూర్చి తలచు వారెవరు? కొన్ని నశించెను. లభించన వాటి నాంగ్లేయులు తమదేశములకు గొనిపోయిరి. కాలప్రవాహమున గొన్ని మలినమై చెడెను. ఇన్నియు పోగా మనకు మిగిలినవే యింత సంఖ్యయుండ నాకాలమున నెన్ని వ్రాయబడి యుండవలెనో యోచింపుడు.

అక్బరు, జహంగీరు చక్రవర్తులు ప్రోత్సాహపర చకపోయినయెడల పర్షియా దేశపు చిత్రరచనా బీజములు మొలకలెత్తి పెరిగియుండకపోవును. భక్తుడగు ఔరంగ జేబునకు కళలయెడలనుండిన నిరాదరము లోకప్రసిద్ధము. బెర్నియరు యీ కాలపు చిత్రకారులగూర్చి యిటులు వ్రాసెను:

ఇంతకు మించిన మంచిప్రభుత్వమునందును, శాంతిగల మన ప్రాన్సునందును వర్ధిల్లునటులు ఇట్టి పరిస్థితులందిన్చట కళలు వర్ధిల్లక పోవుటయం దాశ్చర్యము లేదు. బీదలగు దౌర్భాగ్యులమధ్యను, ధనికు లయ్యు బీదలవలె నటించుచు సౌందర్యమును పాటింపక చౌకనే యెంచెడివారి మధ్యను, చిత్తరువుయొక్క విలువను బాగుగ చెల్లించక బుద్ధిపుట్టినయెడల ప్రతి ఉమ్రా (గొప్పవాడు) యింటివాకిట వ్రేలాడు కొరడాలతో తనపైకమును కోరు చిత్రకారుని దండించు గొప్పవారి

మధ్యను ఎట్టి చిత్రకారుడైనను తన వృత్తియందు శ్రద్ధగలిగి యుండ జాలడు. ఎట్టి పేరును సంపాదింపజాలరని గ్రహించినయెడల చిత్రకారుల యుత్సాహము కుంటుపడదా?...చక్రవర్తియు, ముఖ్యమగు ఉమ్రాలు తమ పోషణక్రింద కొందరు చిత్రకారులను పనిచేయుటకును, పిల్లలకు నేర్పుటకును నియమించి పనిచేయునప్పుడు కొరడాలతో దండించెదమని భయపెట్టకపోయినయెడల హిందూదేశమునందు కళల సౌందర్యము, లావణ్యము చాలకాలము క్రిందటనే నశించియుండును. ...ఒక గదియందు కొందరు చమికీపనివాండ్రు తమ పోషకుని తనికి క్రింద పనిచేయుదురు; రెండవ గదియందు బంగారుపనివాండ్రు, మూడవ గదియందు చిత్రకారులు...

ఈ వ్రాతలందు కొంత యసత్యమున్నను తక్కిన పనివాండ్రతో సమానముగ చిత్రకారుడు గణింపబడు చుండుటయు, వీనికి గౌరవము లేకపోవుటయే కాక జీవనము గడచుటయే కష్టమగుటయు నిశ్చయము. ఒకవిధమగు ఆవేశము—ఉత్సాహముపై లలితకళాభ్యాసకు డాధార పడియుండును. ఇట్టి నిర్మలవ్యక్తి పైజెప్పిన పరిస్థితులందు పనిజేయవలసి వచ్చిన తా నభ్యసించెడి కళయొక్క యంత్యదశ దగ్గరపడుట నిశ్చయము.

చిత్రకారు లందరును చక్రవర్తు లిచ్చుజీతములపై నాధారపడియుండలేదు. అక్బరుకాలమునందుకూడ కొందరు రాజులకొలువునం దుండక చిత్రములను వ్రాసె యర్పించి

బహుమతుల బొందుచుండిరి. ఔరంగజేబు కాలమునను, తరువాత డిల్లియందు పాలించిన వారి కాలమునను రాజులవారితోషకములైననే కాక ప్రజలు చిత్తరువులను గొనుచు నర్పించెడి ధనముపైనను ముఖ్యముగ నాధారపడు టకు పరిస్థితులేర్పడినవి. కాన నిట్టివారి సంఖ్య రాను రాను అధికమయ్యెను. అక్బరు జహాంగీరుల కాలమునందైనను వీరి కుండవలసిన గౌరవము లేకపోయెను. ప్రపంచపు నాగరికత నధికపరచు కళాకోవిదులలో నొకడగు చిత్రకారున కే మనసబుదారుపనినో యిచ్చిన నేపాటి? పుస్తకసంపుటము లను గట్టువారితో వీరిని సమానముగ గణించు నదనున చిత్రలేఖనముయొక్క యాధిక్యమును వారు గ్రహించిరని యెట్లు జెప్పగలము?

బౌద్ధచిత్రములందు చిత్రకారుల నామములు లేవు. తిబెత్తున నొక్కచిత్రమున మాత్రము చిత్రకారుని రూప చిత్రము కలదు. ఇతర చిత్రములనుబట్టి చిత్రకారుల నామ ములు తెలియుటలేదు. మనకు వీరివిషయమై తెలిసిన యంశములు తారానాథుని చరిత్రయందును, తదితర గ్రంథములందును కానవచ్చుచున్నవి.

మొగలు చిత్రకారులు కొందరు పర్షియా యాచా రము ననుసరించి తమ చిత్తరువులందు పేర్లను వ్రాసు

కొనుచుండిరి. మనకు మిగిలినచిత్రములలో నధికాంశమున నిట్టి పేరులు లేవు. కాని సనామములుగ నున్న వాటి సహాయమున వందమొదలు రెండువందల చిత్రకారులు మనకు పరిచితులు కాగలరు. ౧౬౦౦ సంవత్సరమున వ్రాయబడిన 'వాఖియత్తై బాబరీ' యందును, 'అక్బరు నామా' యందును కొందరి పేరులు కానవచ్చుచున్నవి. నామములు తెలిసినను వారి జీవితములనుగూర్చి యేమియు వివరములు లభించుటలేదు.

'మీర్ సయ్యదాలి', 'అమీరు హంజా' యొక్క చరిత్రనుగూర్చి చిత్రములను వ్రాసెను. మొగలు చిత్తరువులందు పెద్దవని పేరుగాంచిన రెండుచిత్రములను వీరే చిత్రించినటులు కానవచ్చుచున్నది. ఈ చిత్రములం దొక్కొక్కటియు ౨ అ. ౮అం. పొడవును, ౨అ. ౨అం. వెడల్పును కలిగియున్నవి.

'క్వాజా అబ్దుల్ సమద్'గారు—హుమయూనుకు మిత్రుడు, అక్బరుకాలమున గూడ జీవించియుండెను. పర్షియాలిపిని వ్రాయుటయం దద్వితీయుడై 'షీరీనుకలమ్' అను బిరుదును పొందెను.

తొమ్మిదవ అధ్యాయము

'ఫర్రుఖ్' అనువాడు 'క్లార్కు' గారివద్దనున్న అక్బరునామాయొక్క ప్రతియందు కానవచ్చెడి మూడు చక్కని చిత్తరువులను వ్రాసెను.

మిస్కీనునకు 'ఉస్తాద్' అను మారుపేరు కలదు. ఈతడు క్రైస్తవ మతమునకు జెందిన చిత్తరువులను వ్రాసెను.

మహమ్మదు నాదీరు, మీరు హాషిమ్, మహమ్మదు ఫకీరుల్లాఖాను, మహమ్మదు ఫజల్ అను చిత్రకళాకోవిదులు చక్కని రూపచిత్రములను వ్రాసిరి. వీరిలో కొందరు జంతువుల చిత్రములను కూడ బాగుగ వ్రాయగలుగుచుండిరి.

హిందూచిత్రకారుల పేరు లధికముగ కానవచ్చుచున్నవి. 'వాఖియత్తై బాబరీ'యందు కానవచ్చిన యిరువదిరెండు పేరులందును పందొమ్మిది పేరులు హిందువులవి. అబుల్ ఫజల్ పేర్కొనిన పదునేడ్గురు చిత్రకారులందు పదుముగ్గురు హిందువులు. 'రాజమ్‌నామ' యను భారతకథను చిత్రించిన యిరువది మొనమండ్రయందును సుమా రిరువది మంది హిందువులు.

దశవంతీకాలపు హైందవ చిత్రకారులలో నెన్న దగినవాడు. 'రాజమ్‌నామా'యందీతని చిత్రముల విగ్రహములు హిందువులను బోలియున్నవి. రచనయందును కొంత స్వేచ్ఛ కలదు. ఏ కారణముననో కాని యీతడాత్మహత్య గావించుకొనెను.

బసవాన్ మరియొక సుప్రసిద్ధ చిత్రకారుడు. ఈతని చిత్తరువులు చాల సుందరముగ నున్నవి. దశవంతునకు మించినవాడీతడని కొందరి యభిప్రాయము.

కేశవదాసు పల్లకీ మోయు జాతివాడైనను దశవంతువలె తన ప్రవీణతవలన గౌరవ పాత్రుడయ్యెను.

జగన్నాథు, సర్వాను, మానశూరు అనువారు మృగముల, పక్షుల చిత్రముల నతి నిపుణతతో వ్రాసిరి.

లాలు, ముకుందు, మాధవ, మహేశ, క్షేమకరణ, తారా, సన్ల్వా, హరిభాను, రామ యను చిత్రకారులను అబుల్‌ఫజల్ పేర్కొనెను.

కళ్యాణదాసు, అనుఫ్‌ఛతర్, మనోహరు, నన్హారాయి, ఖాజ్‌మల్లు అనువారు వ్రాసిన చిత్తరువులు చక్కనివి లభించినవి.

లిపి చిత్రము

(కంగ్రాకలము)



౧. పక్షులు

# తొమ్మిదవ అధ్యాయము

ఉస్తాదు జ్ఞానచందు, బహాదుర్ సింగు అను సిక్కు-చిత్రకారులుకూడ ఉండిరి.

వీరురచించిన చిత్తరువుల లోపాలోపములను కొంత విమర్శించి చూతము:

అజంతచిత్రములందు స్వేచ్ఛకలదు. అంగములందు చలన ముండుటచే జీవముపోసినటుల కానవచ్చును. ప్రాగ్దేశములం దుత్సాహజనకమగు మతముపై నివి యాధారపడి యుండుటచే చిత్రకారుని “పొంగు” ఇందు కలదు. మొగలుచిత్రము లిటులు లేవు. మనుష్యరూపము లందెక్కువ యర్ధభాగము కనపడునటులు నున్నవి కాన, సుప్రసిద్ధులు చిత్రించినవి కాక తక్కినవన్నియు కొయ్యబొమ్మల వలె కానవచ్చును. అంగచలసము వీటియందు చాల తక్కువ. ఈ లోపము జహంగీరు, షాజహానులనాటి చిత్తరువులందు కొంతపోయెను. భారతచిత్రరచనా సంపర్కము దీనికి కారణమై యుండవచ్చును.

మొగలు చిత్తరువులందలి వివరముల నొక్కొక్క సమయమునందు దుర్భిణితో జూడవలసివచ్చును. శిరోజములందు, గడ్డమునందు ప్రతి వెండ్రుకను వ్రాయవలెనని వీరియభిలాష. ఇట్టియోపిక ప్రపంచమున మరే దేశమునను

కానరాదు. చిన్నచిత్రమున ననేకులరూపముల నిట్టి సూక్ష్మతతో వ్రాయగలిగినవారి నిపుణత నెంతయు కొనియాడదగును. కాని యీ వివరములయెడ శ్రద్ధబూని వీరు చిత్తరువునకు గావలసిన యితర విషయములను మరచిరి.

భావములేని చిత్రము జీవములేని శరీరమువంటిది. ఇదిగాక చిత్తరువునగల వివిధవస్తువుల పొందిక, కూర్పు వీటియందు తక్కువగనున్నవి. రాజులయొక్కయు, ధనికులయొక్కయు పోష్యవర్గముక్రింద వర్ధిల్లువారు దయనార్జించుటకు ప్రతివ్యక్తియొక్క సౌందర్యమును జూపవలసివచ్చెను. చిత్తరువునం దెవరి ప్రాముఖ్యమును తగ్గించిన నెవరికి కోపమువచ్చునోయను భయము వీరిని పీడించి యుండవచ్చును. ఈ కారణమే నిజమైన, వీరు భావము నంతగా పాటింపక పోవుటకు కొంత క్షమాపణకలదు.

ప్రారంభమున నచ్చటచ్చట కొన్ని మంచి చిత్రములు వ్రాయబడెను. రానురాను జహంగీరు, షాజహానుల కాలమున చిత్రకారులు మొగలు దర్బారును విడువలేదు. ఏ గ్రంథముయొక్క చిత్తరువులను వ్రాసినను రాజాజ్ఞవలననే; ఏచిత్తరువును వ్రాసినను ధనికుల నానందపరచుటకే. ఇట్టి దాస్యమునందుండిన చిత్రలేఖనమునకు విశాలత కలుగుట దుర్లభము.

## తొమ్మిదవ అధ్యాయము

ప్రకృతిని చిత్రించుటయందు ఐరోపా, జపాను దేశములవారియంత శ్రద్ధ ఈచిత్రకారులు పూనలేదు. ఎచ్చటనైన చెట్లు, పర్వతములు మొదలగునవి యున్నచిత్రములందలి వ్యక్తుల రూపసౌందర్యము నధికపరచుటకేకాని ప్రకృతియందాసక్తి కలిగి కాదు. కొన్నిచిత్తరువులం దిట్టివి బాగుగ నున్నను కళావిమర్శకుల దృష్టిపరుపజాలవు.

అజంత చిత్తరువులందు స్త్రీలను, పురుషులను విలువయగు నలంకారములతో భూషించిరి. ఈచిత్రములందున్నంత విరివిగ మొగలుచిత్రములం దలంకారములు లేకపోయినను, స్త్రీపురుషు లెక్కువ కనుల కింపుగ కానవచ్చునటులు ప్రయత్నించిరి. గాఢములగు రంగులను, బంగారు, వెండి పూతలనువేసి ముఖ్యమగు చిత్తరువులందు వజ్రపుకెంపుతునుకల నంటించిరి. వీటివిషయమై యెంతశ్రద్ధ పూనినను చాయవెలుతురులవిషయమై శ్రమకలుగజేసుకొనలేదు. ప్రాక్పశ్చిమదేశములచిత్రరచన కిదియే ముఖ్యమైన భేదము. ప్రాగ్దేశములందు చిత్రలేఖనమునకు రేఖయే ప్రధానాధారము. ఇదిలేని చిత్తరువు కానబడదు. అధికాభ్యాసము లేనియెడల రేఖ, చిత్తరువునంతను పాడుచేయును. మొగలుచిత్రకారులు దీనిని మృదువుగను, లావణ్యముగల

దిగను, దృఢముగను వ్రాయుటయందు ప్రవీణతను గనపర చిరి. సగము చిత్రింపబడిన చిత్రములం దాధారముగ మొదట వ్రాసుకొనిన రేఖలు కానవచ్చుచున్నవి. ఇవియు చక్కగ నుండుటబట్టి చిత్రములు పూర్తికాకపోయినను సుందరముగనే యున్నవి. అనుభవశాలు రగు చిత్రకారులు రేఖలతో చిత్తరువుల నేర్పరచి, వారి శిష్యులచేతనో, లేక యితరులచేతనో రంగులను పూయించినటులు కొన్ని చిత్రములవలన దెలియుచున్నది. రంగులను పూయుటకన్న రేఖలను వ్రాయుటయే ముఖ్యమని వీరు తలచిరి.

అక్కరు కాలానంతరమున నచ్చటచ్చట ఛాయ నిచ్చుట కలదు. ఒకరంగులో మరియొకరంగు క్రమముగ కలియుటయం దెచ్చటనైన నొకరంగు హెచ్చుటయు, రెండవరంగు తగ్గుటయు లేదు. తలచినఛాయ నత్యద్భుతముగ జిత్రించుటకు వీరు సమర్థులైనను అది చిత్తరువున కనవసరమని త్యజించినటులు కనపడుచున్నది.

నవనాగరికులైన భారతీయులు కొందరు పాశ్చాత్య విధానవ్యామోహమునబడి యీ చిత్తరువులను తీవ్రముగ విమర్శించుట కలదు. ప్రాగ్దేశవిధానములు పాశ్చాత్య దేశముల కెటులు పనికిరావో, పాశ్చాత్యవిధానములు

ప్రాగ్దేశముల కగుటలే పనికిరావు. ఐరోపా చిత్తరువులయందు వలె వీటియందు ఛాయ, స్నాయుపుష్టి కానరావు. రేఖల సౌందర్యము, ఐరోపాచిత్రములందు కానరాదను కారణముననాచిత్తరువులన్నియు నిస్సారములని చెప్పజాలము. శిల్పమునందును, చిత్రలేఖనమునందును భారత దేశ మితర దేశములనుండి యనేకవిషయములను నేర్చుకొనినను తన వ్యక్తిత్వము నెన్నడును మరుగుపరుపలేదు. పాశ్చాత్యచిత్రములనుజూచి, భారతచిత్రములను శూలనాడి యీజాతీయ వ్యక్తిత్వమునకు కళంక మాపాదించుట భావ్యముకాదు.

ఒక మొగలు చిత్తరువునంతయు నొకే చిత్రకారుడు రచించెనని తలచుట పొరపాటు. ఏదేని వర్ణముతో చిత్తరువును రేఖారూపముగ నేర్పరచుట సుప్రసిద్ధ చిత్రకారునిపని. రంగులను వేయుట కితనికోపికయు, సమయము లేనప్పుడు సలహానిచ్చి తన శిష్యులచే పూర్తి చేయించును. కొన్ని చిత్రములందలి ముఖ్యవిగ్రహములను, వస్తువులను తానేచిత్రించి, ఆకాశము, దూరముగనుండుకొండలు, చెట్లు మొదలగు వాటి నితరులచే వ్రాయించును. చిత్తరువునంతయు నీతడే చిత్రించి చుట్టునున్న యంచున కితరులను నియమించుటయుగలదు.

ఈతడెక్కువ శ్రద్ధతో కాగితములను రంగులను ఎంచుచుండెను. పూర్వము హిందూదేశమున పెక్కురకముల కాగితములను తయారుచేయుచుండిరి. ఇందు ముఖ్యమగునది "హరిరి" అనుకాగితము. ఇది కొంతకాలమునకు విరిగిచెడును. నైజాము రాష్ట్రమునందలి దౌలతాబాదున జేయబడినదానికి "దౌలతాబాది"యనియు, సయలుకోట యందు చేయబడినదానికి"సయలుకోటి"యనియు, పర్షియా నుండి దిగుమతిజేయబడినదానికి"ఇస్పహాని", లేక "ఇరాని" యనియు, వెదురుతో జేయబడినదానికి "బంసి" యనియు పేర్లుండెను. హైందవ చిత్రకారులు సాధారణముగ "హిందీ" యను కాగితమును వాడుచుండిరి. దక్షిణమున "మొగలి" యనుకాగిత మాదరింపబడుచుండెను. మైసూరుయొక్క "కార్డ్డే" యనునదియు, నారతో చేయబడిన "తతాహ" యు, "తులత్" అను దూదికాగితమును, "సున్ని" యనునదియుగూడ వాడుకయందుండెను.

రంగులనన్నిటిని చిత్రకారుడు స్వయముగ జేయించుకొనినటులు గానవచ్చుచున్నది. ఇవి చెడక యిప్పటికిని తేజముతో నుండుటవలన అతనిశ్రమ సార్థక మయ్యెను. కుంచెలను మేక, లొట్టియ, ఉడుత, ముంగిస మొదలగు జం

తువుల వెండ్రుకలతో కట్టుకొనుచుండెను. సన్ననికుంచెలు కావలసిన యుడుతల మెత్తని వెండ్రుకల నుపయోగపరిచెను. ఒక విధమగు గడ్డియు అతని కుంచెలకు చక్కగ నుపయోగపడెను.

అక్బరుకాలమునందును కొన్ని చిత్రములను దళసరి వస్త్రములపై నూనెరంగులతో నైరోపారీతిని చిత్రించుట కలదు. ఇప్పు డైరోపాయం దచ్చటచ్చట కానవచ్చు 'హమ్జనామా'యొక్క ప్రతులం దిట్టిచిత్రములుకలవు. కాని యివియెన్నడు నిచ్చట విశేషముగ నామోదింపబడుట లేదు. నూనెరంగులతో చిత్రింపబడెను కాన నొక యైరోపాచిత్తరువును జహాంగీరు నిరాకరించెనట. దక్షిణ హిందూదేశమునగూడ రంగులతో గలుపుట కవిసెనూనె యుపయోగింపబడెను.

మెరుగుబిళ్లతో చిత్రకారుడు మొదట కాగితమును చదునుచేయుచుండెను. రేఖాకృతి నేర్పరుచుటకు జేగురురంగును ముఖ్యముగ వాడెను. కొన్ని సమయములందు నీటిరితో మాత్రము వ్రాయుచుండెను. రంగులన్నియు వేసినపిమ్మట ఆవనూనెయందు కర్పూరపువత్తిని కాల్చగా వచ్చిన నలుపుతో మరల రేఖలు దిద్దుచుండెను;

రంగుల నన్నిటిని నీటిలో గలపుచుండెను. జిగట కావలసి వచ్చినప్పుడు బంక, బెల్లము, అవిసెనీరు మొదలగువాటిని జేర్చెను. ముఖమునందు చక్కనివర్ణము కావలసినప్పుడు పడపోసిన బురదనీటి నాచోటవేసి బాగుగ నారనిచ్చెను. బంగారపుపూత కావలసిన చోటులందు మొదట బియ్యపు గంజినిబూసి దానిపై కుంచెతో కాని, వస్త్రమున మూట కట్టి కాని బంగరురజమును రాల్చి యారపెట్టుచుండెను. ఎండినపిమ్మట నూదివైచిన చో గంజితో దడుపబడిన చోటులందు మాత్ర మీపూత యంటియుండును. ఇప్పటివారీ మార్గములకు హేళనచేయవచ్చును కాని యిటులు చిత్రింపబడిన చిత్రములు బాగుగ నున్నవనిమాత్ర మట్టివారు జ్ఞాపక ముంచుకొనుట భావ్యము.

# పదవ అధ్యాయము

---

రాజపుత్ర చిత్రలేఖనము ౧

బౌద్ధమతమునందు ఉత్సవములకు తావులేదు. మానవజీవనముయొక్క ప్రాముఖ్యమును గ్రహించి,నిర్వాణమును బొందుటకు శక్తినంత నుపయోగించుటకు పాపపూరితములైన సాంసారికసుఖముల నన్నిటిని త్యజించి, శిరోముండనమును గావించుకొని, సన్న్యసించి, భిక్షాటనము గావించుచు పాటుపడుట యీమతము యొక్క ముఖ్యోద్దేశము. ఇంత త్యాగముచేసి యీమతమును స్వీకరించినవారితరులను గూడ తమవలె నిర్మల ప్రవర్తనమును గలిగియుండునటులు చేయ బ్రయత్నించుట సహజము. అటులుగానియెడల వీరు చిత్రలేఖనమును బోషించుటకు బదులు నిర్మూలమును జేయుటకు తోడ్పడియుండెడివారు.

భారత దేశమున బౌద్ధమతముయొక్క ప్రాముఖ్యము తగ్గినవెంటనే మరల హిందూమతము తల

యెత్తెను. సంఘమున నానందమున మెలగుటకు సాధారణముగ మానవులు కోరుచుందురు. కాన, బౌద్ధమతము యొక్క కాఠిన్యమునకు లోనై యణగియుండి యిప్పుడు కలిగిన యనుకూలతను జూచి హిందూమతమున హిందువు లనేకములైన దర్శనీయములగు నుత్సవాద్యాచారములను బ్రవేశపెట్టిరి. హిందూమతము తన పరాజయమునం దనేకవిషయములను నేర్చుకొని నూతనస్వరూపమును దాల్చెను. జాతిభేదము, పురాణముల ప్రాముఖ్యము, పూజావిధానములు, ఉత్సవములు మొదలగునవి ప్రజల నాకర్షించుటకు తలలెత్తెను. విగ్రహారాధన ప్రధానముగ నెంచువారికి బౌద్ధులచే బోషింపబడిన చిత్రలేఖనము చాలలేదు. మనుష్యాకారమున విగ్రహముండవలెనను కోరిక పెరుగుటచే చిత్తరువులకు బదులు శిలావిగ్రహములు నిర్మింపబడెను. దేవాలయములు శాశ్వతముగ నుండవలెను. కాన నిట్టి విగ్రహములు చిత్తరువులను మించినవని తలచిరి. శైవులకు, వైష్ణవులకు గలిగిన మతద్వేషములందుపోటీయెక్కువయై యెవరిదేవాలయములను వారే నిర్మించుకొని యలంకరింపజొచ్చిరి. ఎచ్చట జూచినను చక్కని శిలానిర్మితములగు దేవాలయములు కానవచ్చుట కిది యొకముఖ్యకారణ మయ్యెను. శిల్పమునందు కళా

భ్యాసకులు నియుక్తులగుటవలన చిత్రలేఖనము వెనుక బడెను.

హైందవనాగరికత యొక్కయు, మతము యొక్కయు వ్యక్తిత్వమును మొదటినుండియు గాపాడిన భారత జాతియొక్క పట్టుదల, మార్పులయెడలగల యనుమానము నందును చిత్రకారులకు లాభకారియయ్యెను. ఎన్నిమార్పులు కలిగినను,శిల్పమెంత యామోదింపబడినను,బౌద్ధులకాలమున విజృంభించిన చిత్రలేఖనము సంపూర్ణముగ మాయము కాక యచ్చటచ్చట నభ్యసింపబడుచుండెను. కాని యీ కాలపు చిత్తరువు లించుమించుగ నన్నియు నశించుటవలనను, తక్కిన యాధారము లెవ్వియు లేకపోవుటవలనను, చిత్రలేఖన మెట్టిమార్పులను జెందెనో, యెవరిపోషణ బడసెనో చెప్పుట దుర్లభము. తొమ్మిదవశతాబ్దమున రాజపుత్రులు నిద్రావస్థనుండి లేచుటయు, గుజరాతు రాజుల పరిపాలనపటుత్వమువలన నుత్తరహిందూదేశమునంతను వారిగొప్పతనమును స్వీకరించుటయు చిత్రలేఖనమునకు కొంత యనుకూలముగ నుండెను. మహమ్మదీయులు భారతదేశమును జయించుటకు వీలగు పరిస్థితులను గల్పించిన రాజపుత్రుల యంతఃకలహములకు పూర్వము చిత్రిం

పబడిన కుడ్యచిత్రములు జయపూరు, బికనీరు, జోదు పూరు, ఉదయపూరుల పురాతనరాజగృహములందు గన బడుచున్నవి. పర్షియా, చైనాలవిధానములు వీటియందుం డుటవలన బౌద్ధచిత్రములకును, మొగలాయీలకాలము నాటి రాజపుత్ర చిత్రములకును సంబంధ మేర్పడుచు న్నది. ఎనిమిదవ శతాబ్దమున మహమ్మదుఖాసిము సింధును జయించుచున్నప్పుడు కొందరు చిత్రకారు లాతని వద్దకువెళ్లి యావీరుని రూపచిత్రమును వ్రాయుట కను మతి నడిగిరట. పదునైదవ శతాబ్దమున జైనమత గ్రంథ ములందు కొన్నిచిత్రములు కలవు. దేశమం దంతటను వ్యాపించిన విద్య యొక్క పరి నశించుట చరిత్రకు విరు ద్ధము. అక్బరుకాలమున మొగలు చిత్తరువులనుజూచి హిందూచిత్రకారులు తమదేశాచారములను మరువక వ్రాయజాలుట యీ వాదనను బలపరచును. ఐనను అక్బరుచక్రవర్తి కాలముననే రాజపుత్ర చిత్రలేఖనమును విజృంభించెననుట పొరపాటు. మొగలు చిత్రలేఖనము రాజదర్బారునుండి ప్రజలందు వ్యాపించిన పిమ్మటనే యీ హిందూవిధానములు విశేషముగ నభ్యసింపబడెను.

బౌద్ధమతముతో పెద్దయాత్రమములు, చైత్యగృ హాములు త్యజింపబడెను. శిల్పముయొక్క ప్రాముఖ్యము

హెచ్చినకొలది దేవాలయకుడ్యములమీద పెద్దచిత్తరువులకు చోటులేకపోయెను. మొగలు చిత్రకారుల సాంప్రదాయముల ననుసరించి హిందువుల రాజదర్బారులందామోదింపబడుచుండిన చిత్తరువులవలె చిన్నవిగ వ్రాయ ప్రారంభించిరి. చూచుట కివి మొగలు చిత్రములను బోలియున్నవికాని విమర్శించిచూడ అజంత మొదలగు హిందూచిత్తరువుల నమూనాలవలెనుండును. రేఖలప్రాముఖ్యము యిందు బాగుగనున్నది. భావమునందును, మతావేశమునందును, రాజపుత్ర చిత్రరచనకును, మొగలు చిత్రరచనకును చాల భేదముకలదు. మొగలు చిత్రములు ప్రకృతిననుసరించియుండును. హిందూచిత్రములకు భావమే యాధారము. మహమ్మదీయమతము మహమ్మదు యొక్క బోధనపై నాధారపడియుండునటులు, మొగలు చిత్రలేఖన మేదేశపాలకులనో యాశ్రయించియుండును. హిందూమతయొక్క మహావ్యక్తిపైనే కాక ప్రజలనమ్మకముపై నాధారపడినటులు హిందూ చిత్రలేఖనమును ప్రజల నాశ్రయించియుండును.

మొగలు చిత్రలేఖనవిధానములు ప్రజలందు వ్యాపించి హిందువుల యుద్దేశముల కనుగుణముగ మా

రెను. ప్లాసీ యుద్ధానంతరము-అనగా పదునెనిమిది, పందొమ్మిది శతాబ్దములం దీచిత్తరువులు విశేషముగ వ్రాయబడెను. హిందువుల కనేకవిధముల బాధ కలుగజేసిన మొగలు సామ్రాజ్యముయొక్క పతనము, మహారాష్ట్రులరాజ్యస్థాపనము, జైనమతవిజృంభణము ప్రజలందు నూతనోత్సాహమును బుట్టించుటచే మొగలు చక్రవర్తుల పోషణ లేకపోయెనను చింత చిత్రకారులకు లేకపోయెను.

రాజపుత్రస్థానమున జయపూరు రాజ్యము చిత్రలేఖనమునకు ముఖ్యమైన యాశ్రమముగ నేర్పడెను. అక్బరునకు పూర్వము స్థాపితమై మొగలుసామ్రాజ్యానంతరముకూడ వాడుకలోనుండిన జయపురకలము ననుసరించి చిత్రకారులు చక్కని చిత్రములను వ్రాయుచుండిరి. డేగయొక్క చిత్ర మెంతస్వభావసిద్ధముగ నున్నదో చూడుడు. ఈ ప్రాంతముననే ఆల్వారునందు చిత్రింపబడిన చిత్రములు కొన్ని చక్కగనున్నవి. ఇచ్చట గ్రంథాలయములందు గానవచ్చు 'గులిస్తాను' అను పురాతన గ్రంథమునగల జంతువుల చిత్రము లతి మనోహరములు. కాని యీచిత్ర సమూహమునందలి రూపచిత్రము లాచార ప్రాయములుగను, జీవకళారహితములుగను ఉండుటవలన బాగుగలేవు.

# పదవ అధ్యాయము

మొగలు సామ్రాజ్యము విజృంభించుటయు, చిత్రలేఖనమున డిల్లీ యందుగల యాదరణయు నీరాజపుత్ర



చిత్రకారుల ననేకుల నాకర్షించెను. మొగలులకు ముఖ్యస్థానములగుడిల్లి,ఆగ్రా, లాహోరు మొదలగుమహాపట్టణములందు విదేశపు చిత్రలేఖనముతోపాటు హిందూచిత్రరచనయు నభ్యసింపబడెను కాని ఔరంగజేబునకు కళల రుచి తెలియక పోవుటవలనను, ఖోరానుబోధననే ప్రమాణ మగుటవలనను, చిత్రకళాకోవిదులుకాశీ, లక్నో, హైదరాబాదు, పాట్నా మొదలగు స్థలములందు జీవనోపాధిని కలుగజేసి కొనుటకు చెదరిపోయిరి. ఇప్పటివలె నా కాలమున ప్రయాణ సౌకర్యములు



లేకుండుటచే ఎక్కడివారక్కడనే నిలిచిపోయి ఒక్కొక్క స్థలమువారు ఒక్కొక్కవిధమున చిత్తరువులను వ్రాయుచువచ్చిరి. ఈనూతనచిత్రములందు కంగ్రాచిత్తరువులు ముఖ్యమైనవి.

పంజాబునందుత్తరభాగమున హిమాలయపర్వత సానువులందు కంగ్రా, లేక నగరుకోటయను శత్రువులకభేద్యమగు దుర్గముండెను. ఇచ్చట పాలించుచుండిన హిందూరాజుల పోషణయందే కాలమునుండియో కొందరు చిత్రకారులు చిత్రములను వ్రాయుటయే వృత్తిగ నేర్పరుచుకొనియుండిరి. ౧౬౨౧ వ సంవత్సరమున జహాంగీరుచక్రవర్తి యీ కోటను వశపరచుకొనినపిమ్మటగూడ వీరివృత్తినివదలక చక్కనిచిత్తరువులను చుట్టునున్న ప్రదేశములందు వ్యాపింపజేయుచుండిరి. నూరుపూరు, బసోహ్లి, చంబ, జమ్ము మొదలగు కంగ్రా పరిసరదేశములందును చిత్రకారులుండుటవలన వీరిని కంగ్రాచిత్రకారులని పిలుచుటకంటె "పహాడి" అనగా కొండప్రదేశపు చిత్రకారులని పిలచుట సమంజసమని యిప్పటి కళావిమర్శకుల యభిప్రాయము.




సవాయి జయసింహుడు

యన్. సి. మెహతాగారి 'ఇండియన్ పెయింటింగు' అను గ్రంథమునుండి.

౧౨౬(b)

## పదవ అధ్యాయము

పదునేడవ శతాబ్దపు పహాడి చిత్తరువులు కొన్ని లభించెను. అంతకుముందు చిత్తరువొక్కటియు లేకపోవుటచేతను, మొగలు సామ్రాజ్యమున చిత్రకళకు పోషణ మీకాలముననే తగ్గుటచేతను ఢిల్లీ మొదలగు పట్టణములనుండియు చిత్రకారులీప్రాంతములకు వచ్చి కంగ్రా యొక్క 'కటోచి' రాజుల నాశ్రయించినటులు గానబడును. ఈ చిత్రకారుల సమూహము పదునెనిమిదవ శతాబ్దమున 'సంసారచంద్' అను రాజుపాలనయందు మిక్కిలి యున్నతదశయందుండిరని వీరు చిత్రించిన చిత్రములవలన దెలియుచున్నది. పంజాబునందు వీరిచిత్తరువు లనేకములు శ్రీమంతుల గృహములందునగలవు. మఱియు ౧౯౦౨-3 సంవత్సరములలో ఢిల్లి ప్రదర్శనమునజూపబడినవి రెండు వందలకు మించెను.

తక్కిన రాజపుత్రచిత్రములవలె నివియు మొగలు చిత్రములటులు గానవచ్చును. పై జెప్పిన యంశములనుబట్టి చూడ నీచిత్రకారులు మొగలువిధానముల కలవాటుపడి హిందూసాంప్రదాయముల ననుసరించిరని గోచరించును. అజంతాచిత్తరువులవలె వీరి చిత్రములందు జీవ

కళ, ఆవేశము, ఆలోచనాప్రతిభ అంతగా కానరావు. కాని, రేఖల లావణ్యమునందును, వర్ణముల సొగసునందును, వస్తుపరిచయము నందును, వివరముల ప్రదర్శనము నందును తక్కిన యీకాలపు చిత్తరువులకు తీసిపోవు.

ఇవియన్నియు రాజులకొరకును, ఆప్రాంతపు ప్రజలకొరకును వ్రాయబడినవి. రానురాను వీటికీర్తి నలుదిశల వ్యాపించుటచే దూరదేశములందు నాదరణ బడయజొచ్చెను. రంజిత్ శింగు మహారాజుయొక్క లాహోరు, అమృతసరుదర్బారులం దామోదింపబడుటయే యచ్చటి యుద్యోగుల రూపచిత్రములు వీటియం దనేకములు కానవచ్చుటకు కారణము. పంజాబు శ్రీమంతుల గృహము లందివి యిందువలననే యిప్పుడును ఉన్నవి.

పందొమ్మిదవశతాబ్దమున నీప్రాంతములకు మంచి మార్గములు వేయబడుటచే నితరదేశముల నాగరికత యిచ్చటను వ్యాపించెను. దీనితో పహాడి చిత్రరచన యొక్క వ్యక్తిత్వము నశించెను. సంకరచిత్రములు వ్రాయబడుటతో తొలిలావణ్యము తగ్గిపోయెను. ఇంత కెక్కువ రాబడివచ్చునని వీరి కుమారులు ప్రభుత్వపు ఉద్యోగముల బ్రవేశించి తమ వృత్తిని మానుకొనిరి. ఈ

పరిస్థితులకు ప్రకృతియు దోడ్పడెను. ౧౯౦౫ వ సంవత్సరము ఏప్రిలు ౪ తేదీని పెద్ద భూకంపము కంగ్రానగరము ను, చుట్టునున్న ప్రదేశమును సంపూర్ణముగ నశింపజేసెను. ఇందు చిత్రకారులలో నధికసంఖ్యాకులు మరణించిరి. దీనితో సిపహాడి చిత్రరచన సంపూర్ణముగ నంతమొందెను.

కాశీ మొదలగు స్థలములందు పెక్కు చిత్తరువులు లిఖింపబడెను కాని వాటిచరిత్రనుగూర్చి వివరములు అంతగాలేవు. ప్రత్యేకముగ తక్కిన చిత్తరువులకును, వీటికిని విశేషము భేదములేదు కాన వీటివిమర్శన లాభకారి కాదు.

* రాజపుత్ర వర్ణలేపనము ముఖ్యముగ ప్రజలకళ. సహజముగనిది వారి యానందౌన్నత్యముల కొరకు నిర్మితమయ్యెను. పల్లెటూరివాని నిర్మల జీవితము, వాని పనిపాటులు, వాని మతవిషయకోత్సవములు, వాని గృహమున కష్టసుఖములు, మతవాతావరణము లిందు ప్రతిబింబితము లయ్యెను.

తమకు కానవచ్చు చక్కని మానవజీవితమును కొన్ని కుంచెగీటులతో చిత్రరూపమున నిప్పటి యాంగ్ల

* పెర్సీబ్రౌనుగారి "హైందవ వర్ణలేపనము" అను గ్రంథము నుండి.

చిత్రకారులు విలాసార్థము ప్రదర్శించుచున్నారు. ఇట్టి సాధారణ చిత్రములను తైలవర్ణములతో గుడ్డమీద వ్రాయుట సులువుగనుండదు. రాజపుత్ర చిత్రకారు డీతర గతిలో జేరును. మొగలుదర్బారులందు కావలసివచ్చిన చిత్రములవలె వజ్రపు తునుకలతోను, వెండి బంగారు పూతలతోను చిత్తరువును సృజించుట యీతనికి లాభకారి కాదు. ఇట్టి విలువగల పరికరము లీతనికి లభించుటకు నవకాశము లేదు. తన దైనికజీవితమున గానవచ్చు కంసాలి, వడ్రంగి, సాలె, చమికీపనివాడు, అద్దకము పనివాడు తమ తమ పనులందు నియుక్తులైయున్నటులు ననేకచిత్రములను వ్రాసెను. పనిముట్లు, దగ్గర నాడుకొనుచున్న పిల్లలు, పిల్లలనాడించుచు నానందించుచున్న స్త్రీలు ఈచిత్రములందుండుటచే మొగలు చిత్తరువులకులేని ప్రాముఖ్యము వీటికి కలదు. ఉదరపోషణకొరకు పాటుపడు వీరికష్టసుఖములు, తోడి పనివాండ్రయెడలగలసానుభూతి వీటియం దద్భుతముగగలవు.

పాములవాని చిత్రమును జూడుడు: పాము, దాని బుట్ట, బుట్టకుగట్టుబట్ట, పాములవాని బీదవస్త్రములు, వానిమూట అన్నియు నేకీభవించి సహజముగ నున్నవి.

పదవ అధ్యాయము



* ప్రయాణమున సాధారణముగ గలిగిన యానంద విచారముల ప్రదర్శనమునందు రాజపుత్రచిత్రకారు డితరులను మించెను. ఇప్పటి ఇంజనుల సహాయమున బ్రయాణము జేయుటకు పూర్వము హిందూదేశమున బ్రయాణము తాపిగను, ఆనందముగను జరుగుచుండెను ........ చిత్తరు వాహ్లాదకరముగ నుండుటకు మధ్యాహ్నపు విశ్రాంతి, రాత్రియందు బసలవద్ద మంటలు, పల్లకియందు దీర్ఘప్రయాణము మొదలగునవన్నియు నీతడు నియతితో జూపెను. ప్రయాణికులకు మఱ్ఱిచెట్టుయొక్క చల్లని నీడ యాహ్లాదజనకము. ఈగ్రంథమునగల చిత్తరువునందు ప్రయాణికు లీ వృక్షముచుట్టు నున్నారు. ముందున నలసటజెందిన కూలివాడు తనబరువును దింపి యొక వస్త్రముపై దేహమును జాచియున్నాడు. దూరమున మరియొకడు విశ్రాం

---

* పెర్సీబ్రౌనుగారి "వర్ణలేపనము" నుండి.

తిసుఖము ననుభవించుచున్నాడు. ను-తినద్దమున్న యొక స్త్రీ జలమును పోయుచుండ వస్త్రపాణియగు భటుడు దాహమును దీర్చుకొనుచు



న్నాడు. క్రింద నొక సేవకుడు తన యజమానునికొరకు హుక్కాను సిద్ధపరచుచున్నాడు. యజమానుడొక యద్దమును చూచి కురులను దువ్వుకొనుచుండ నొక స్త్రీ కాళ్లు పట్టుచున్నది. మరియొకతె విసరుచున్నది.

## పదవ అధ్యాయము

శునకము, ఖడ్గము, హుక్కా—ను బీల్చు మరియొక భటుడు మొదలగునవన్నియు జూడ నీచిత్రకారునకు వస్తుపరిచయము గోచరము కాగలదు. ఇది పదునెనిమిదవ శతాబ్దపు పహాడి చిత్తరువు.

పంజాబున చంబాను పాలించుచుండిన రాజుయొక్క— రూపచిత్రము లనేకములుకలవు. ఇందొకదానియందు నృపుడు రాణితోను, యువరాజుతోను ఉన్నటులుగలదు. సహజముగ రాజపుత్ర చిత్రకారుడు రూపచిత్రములను వ్రాయువాడు కాడు. కాని భారతభూమినంతను పాలించుచుండిన డిల్లీ చక్రవర్తు లామోదించుటవలన గలిగిన జనాంగీకారమువలననో, యుదరపోషణకొరకో చక్క—ని రూపచిత్రములను చిత్రించెను. జయపూరునందు చిత్రింపబడినవాటికిని, కంగ్రాయందు చిత్రింపబడినవాటికిని భేదముకలదు. జయపూరుచిత్రములు తక్కి—న రాజపుత్ర చిత్రములవలె రేఖానిర్మితములుగను, ఆచారప్రాయములుగను, అర్ధభాగము కనబడునటులును, పలుచని వర్ణములతోనుగలవు. రేఖలు సన్నముగను, ప్రాణపూరితముగను ఉన్నవి. కంగ్రా చిత్రములందు వర్ణములు గాఢముగను, వెలుతురుఛాయలు తారతమ్యముగను, లలితముగను గలవు. ఈ చిత్రమున గల వృద్ధుని, బాలుర విగ్రహము

లను జూడుడు. యోగి, వ్యాసుడు మొదలగుచిత్రములు కొనియాడదగినవి.



కాగితముమీద తొలుత నల్లని రేఖలతో రూపము నేర్పరచుకొని, దానిపైని తెలుపునుబూసి, కావలసిన వర్ణలేపనమును జేసి, మరల మొదటిరేఖలపై దిద్ది రూపచిత్రములను వీరు పూర్తిచేయుచుండినటులుగానవచ్చుచున్నది. వర్ణసౌందర్యమే వీటియందు ప్రధానముకాదుకాన, దంతమువలె నిగనిగలాడుచు నాకారముకొరకే వర్ణములుండి చిత్రకారుని యుద్దేశమును జూపుటయే ప్రధానము. దీని నీరచనా విధానము నెరవేర్చెను.

---



రాధాకృష్ణులు

యన్. సి. మెహతాగారి 'ఇండియన్ పెయింటింగు' అను గ్రంథమునుండి.

# పదునొకండవ అధ్యాయము

## రాజపుత్ర చిత్రలేఖనము ౨

వేదాంతము శాస్త్రముల సారమనియు, దేవునా రాధించుటచే జన్మము సాఫల్యము జెందుననియు భావించు హిందూకళాకోవిదులు తమవిద్యను, దేవునిలీలలను గొనియాడుటకే ముఖ్యముగ వినియోగించుటయం దాశ్చర్యము లేదు. హిందూమతమును విడనాడి, అలంకారముల నన్నిటిని త్యజించి బౌద్ధమతమును స్వీకరించిన హైందవులును బుద్ధుని చరిత్రను చిత్రరూపమున ప్రదర్శించి తృప్తులైరి. హిందూమతము తలయెత్తిన పిమ్మట శిల్పులు చక్కని దేవాలయాదులను నిర్మించి ధన్యులమైతిమని తలచిరి. అట్టియెడ మొగలుచిత్రరచనవలన గలిగిన కళాసంచలనమును హిందువు లీవిషయమై యుపయోగపరుపక యూరకుండెదరా ?

తక్కినమతములకంటె హిందూమతము చిత్రరచన కెట్టి ప్రతిబంధకమును కలుగజేయకపోవుటయేకాక

దానిని బాగుగ ప్రోత్సాహపరచును. పురాణములందు దశావతారముల వర్ణన గలదు. వీరు రాక్షసులను జంపుట, భక్తుల నాదరించుటనుగూర్చి చక్కని కథలందు వివరములు కలవు. ఇవికాక, స్వర్గము, ఇంద్రసభ, మొదలగువాని వర్ణనములు గలవు. నలచరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము మొదలగు కథ లెన్నియో కలవు. భారత, భాగవత, రామాయణాదు లిట్టి కథలకు పుట్టినిండ్లు. సర్వసాధారణముగ నిందు విశేషభాగములు ప్రజలెరిగినవి. వారిభక్తికి వీటిని దెలుపు చిత్తరువు లెంతయు నుపయోగపడును. ఈ కారణములవలన రాజపుత్రచిత్రము లలో ననేకములు పురాణములకు జెందును.

ఉత్తరహిందూదేశమున శ్రీకృష్ణు ననేకు లారాధింతురు. జన్మముతోనే యీ మహాపురుషుడు ప్రజల నాకర్షించెను. కారాగృహమున జన్మించుట, వేరుస్థలమునకు రహస్యముగ గొనిపోబడుట, బాలక్రీడలచే చూచువారి నాకర్షించుట, గోపికలతో విహరించుట, పెరిగి పెద్దవాడైన పిమ్మట ఘనకార్యములను నిర్వహించుట మొదలగునవన్నియు చిత్రకారుని ప్రవీణతను బ్రదర్శించుటకు సహాయపడును. వాని యుదరపోషణయు జరుగును.

# పదునొకండవ అధ్యాయము

జయపూరునందు 'రాజమ్‌నామా' యను సచిత్ర మహాభారతముకలదు. ఇందుగల ౧౬౯ చక్కని చిత్తరువులందు దమయంతి స్వయంవరమునుగూర్చిన చిత్రము చాలచక్కనిది. ప్యారిసునందుగల భాగవతమున ౭౧ సుందరమైన చిత్రములుకలవు.

రామాయణమున రామునిగుణములను జదివి హర్షించనివారుండరు. నీతితో ప్రవర్తింపజూచు ప్రతి హిందువునకు నీ రాజకుమారు డాదర్శపురుషుడు. పరమభక్తుడగు తులసీదాసు రామచరితమానసమను గ్రంథమున నీ రాముని గుణములనుగూర్చి పాడెను. క్రైస్తవులకు బైబిలెట్టిదో కొందరుహిందువుల కీగ్రంథ మట్టిదని యొకానొక పాశ్చాత్య పండితుడు వ్రాసెను. సచిత్రమైన యీగ్రంథ ప్రతి యొకటి కాశీరాజువద్దనున్నది. ఐదువందలకు మించి యున్న యిందలి చిత్తరువులు బంగారు వెండిపూతలతో, చక్కనివర్ణములతో నలరారుచున్నవి.కొన్నిటియం దనేక విగ్రహము లుండుటవలన సౌందర్యరహితములైయున్నవి. ఒకమూల తులసీదాసును, మరియొకమూల నాతనిగురువును, చిత్రకూటపర్వతమున సీతారామలక్ష్మణు లొక చోటను, కామధేనువాదగ్గరను, ఇంకను ఋషులు, సర్ప

ములు, చెట్లు, సరస్సు మొదలగునవియు నొకేచిత్రమున నుండుటవలన భావరహితమైయున్నది. రచనయు నాచార బద్ధమగుటచే జీవకళ కొంచమైనను కానరాదు. "రాముని బాల్యము" అనబడు చిత్తరువు మిగుల సుందరమైనది. వస్తువులపొందిక, ప్రమాణము మొదలగునవి చిత్రకారుని ప్రావీణ్యమును జూపుచున్నవి. యశోదయు, రాముడును మధ్యనుండుటవలన వారిప్రాముఖ్యము బాగుగ దెలియును. అంతఃపురమున మెలగు హిందూస్త్రీల లావణ్యము, నాగరికత యిటునటుగల స్త్రీలయందవతరించియున్నవి. తక్కిన చిత్తరువులందువలె ననవసరముగ దీనియందు స్త్రీపురుషులు, వస్తుసముచ్చయము లేవు. వర్ణికాభంగ మతియు తక్కుష్టము.

శైవమతముయొక్క చిత్తరువులు, అనగా శివపార్వతు లొకచోటనున్నటులును, శివుడు తాండవమాడుచున్నటులు మొదలగున వనేకములు కలవు. మోహనసింగుచే వ్రాయబడిన చిత్తరువులు చక్కనివి. ఉమాదేవి శివుని ప్రార్థించుచున్నటులుగల చిత్రము మనస్సు నాకర్షించును. భక్తిపూరితమగు ఉమయొక్క సుందరవదనము, దగ్గర నున్న యిరువురు పరిచారికల పొందిక, పూజాద్రవ్యము

లు, దూరముననున్న వృక్షములు, పర్వతము, ఆకాశ మున మేఘము, సగముకనబడు చంద్రుడు, అన్నియుగలసి చిత్తరువున నతిరమణీయముగనున్నవి.

యముడు, వ్యాసుడు మొదలగువారి చిత్రములు బాగుగనున్నవి.

మనంబున బుట్టు ఉన్నతభావములు లలితకళల రూపమున వెలువడును కాన వీటి కన్యోన్యసంబంధము కలదు. దీని నాధారముగగొని రాజపుత్రచిత్రకారులు సంగీతమును, చిత్రలేఖనమున బ్రదర్శింప దమ ప్రవీణత నుపయోగించిరి. ప్రపంచమున నెచ్చట నిట్టిప్రయత్నము జరుగలేదు. లలితకళయగు కవిత్వమును చిత్తరువులరూప మున బ్రదర్శించినప్పుడు సంగీతము నేల నిటులుపయో గపరుపరాదు ?

హిందూసంగీతమున ఋతుభావమునకు దగిన రాగము, రాగమున కుపరాగములు కలవు. అన్ని విధ ములగు భావములకు దగిన రాగము లేర్పరుపబడెను. రాగమున కుపరాగములుగ నైదురాగిణులు కలవు. ఈ భావములను వెలిపుచ్చునటులు పెక్కుచిత్తరువులు కలవు. ఆచారబద్ధులు కానందున నీచిత్రములందు చిత్రకారులు

తమ స్వేచ్ఛనంతనుజూపి లావణ్యమును చక్కగ బ్రదర్శింపజాలిరి. వారనుహేస్టింగ్సు రాజప్రతినిధిగ నున్నప్పుడు వీటిని విశేషముగ తమదేశమున కంపెను. హిందుదేశమునం దిప్పటికిని అనేకములుకలవు. ఇట్టి రచనయందు పహాడీ చిత్రకారు లితరులను మించిరి.

కాళిదాసాది మహాకవులు రచించిన నాటకములందలి, ప్రబంధములందలి నాయికానాయకుల యన్యోన్య ప్రేమను జూపు చిత్రములు, ముఖ్యముగ రాధాకృష్ణుల లీలలు హైందవ చిత్రకారులచే చిత్రింపబడినవి. ఇందధికాంశము ౧౭, ౧౮, శతాబ్దములందు పహాడీ చిత్రకారులు వ్రాసినవి.

మొగలుచిత్రలేఖకుడు వేటయందు, పందెములందు మృగములను వ్రాసెను. చక్రవర్తులచే నియమింపబడినప్పుడు జంతువులను, పక్షులను ప్రత్యేకముగ వ్రాసెను. కాని హిందువులగు రాజపుత్రుల దృక్పథము వేరు. వీటికిని సుఖదుఃఖములు కలవని గ్రహించి సానుభూతిని—కొన్ని సమయములందు ప్రేమను—జూపుచుండిరి. పురాణకథలను జదివినవారు కాన గరుడపక్షి, హంస, నెమలి, యెలుక, యెద్దు, గేదె మొదలగునవి

తాము పూజించిన దేవతల వాహనములనియు, ఏనుగు విష్ణువుచే నుద్ధరింపబడిన భక్తుడనియు, వానరులు శ్రీరాముని బంటులనియు, గోవులు శ్రీకృష్ణుని చెలికాండ్రనియు గౌరవముతోను, భక్తితోను స్మరింతురు. హనుమంతుని విగ్రహమున కోతికిగల చలనభావము కానరాదు. కృష్ణుని దగ్గరనున్న యావులందు దుష్టస్వభావమేమాత్రమును నుండదు. స్త్రీపురుషులవలె నివియు నలంకృతములు. ఇట్టి భావములు కల రాజపుత్రచిత్రకారులు పక్షులను, మృగములను చక్కగ వ్రాయజాలుట వింత కాదు. పురాణములందు గౌరవస్థానము నీయబడని మృగములుకూడ వీరి చిత్తరువులం దెంతయు స్వాభావికముగ నున్నవి.

రాజపుత్రచిత్రకారులు రేఖలనే కాక చాయను, వెలుతురును చక్కగ చిత్రించిరి. చంద్రుని ప్రకాశము పెక్కుచిత్తరువులందు గలదు. కొన్నిచోట్ల వెనుకవైపున, మార్గమున బసలందు మంటలవెలుతురు వేరొకవైపున బ్రసరించుచున్నట్లులు గలదు. ఈ రెండు వెలుతురుల మేళవింపతిమనోహరము. సువర్ణరజమును తొలుత బూసి, పిమ్మట వర్ణములను బూయుటవలన నిందు వీరు నూతన

మైన సొంపును గూర్పజాలిరి. నీటిపై చంద్రకాంతి ప్రసరిం చునటులు చూపుటకు రజతరజము నుపయోగపరచిరి.

రాజపుత్రచిత్రకారులలో జశ్వంతు, తులసి, మోహనసింగు, గోవిందసింగు, ఉదాత్ సింగు, గులాము రజా, గులాము ఆలీఖాను, బలదేవు, కపూరుసింగు మొదలగువారిని ప్రవీణులుగ జేర్కొనవచ్చును.

దక్షిణహిందుస్థానమున పదునారవశతాబ్దమునాటి చిత్రములందు పర్షియావిధానములు కానవచ్చుచున్నవి. ఔరంగజేబుయొక్క దక్షిణదండయాత్రయందు, మొగలాయీల పోషణ తగ్గుటవలన స్వపోషణార్థమై చాలమంది చిత్రకారులు దక్షిణమునకుపోయి డిల్లీవిధానములను బ్రవేశపెట్టిరి. దక్కనునందలి పాలకుల చిత్తరువులనేకములు కలవు కాని యెన్నదగినవి కావు. నైజామున ఆనెగొందెయందుగల జంగము మఠమున గొందరు ఫకీరుల, వారి యాశ్రితుల చిత్రములు చక్కనివి కలవుకాని అవి ఉత్తరహిందూదేశపు చిత్తరువులతో సరిపోల్పదగవు.

ఉత్తర హిందూస్థానమునతో విశేషము సంపర్కములేని జయ, పరోజయ, విజయ అనుముగ్గురు చిత్రకారులు దక్షిణముననుండిరని తారానాథుడు వ్రాసెను. తిరు



౫. నారీ తురగము



౫. నారీ తురగము

మలెయని జైనుల యాత్రాస్థానమున గోడలపై గొన్ని చిత్తరువులు కలవు. ఇందలి శాసనములబట్టి యివి పదునొకొండవశతాబ్దమున వ్రాయబడినటులు నిర్ణయింపబడెను. ఒక యిటుకగోడపై నొకచక్రాకారము కలదు. దీనిమధ్యను జైనులమతగురువగు తీర్థంకరుని చిత్రము కలదు. చక్రము పండ్రెండుభాగములుగ విభాగింపబడియుండ, ఒక్కొక్క భాగమున స్త్రీల, జంతువుల చిత్తరువులు కలవు. చక్రము నాల్గువైపుల నెగురుచున్నటులు నప్సరసలు కలరు.

కాంచీపురమునందుగల కామాక్షి, వరదరాజ పెరుమాళ్ల దేవాలయములందును చిత్తరువులు కలవు. ఇందొకదానియందు ఏనుగుపై విల్లుబూనిన పురుషుడున్నటులు గలదు. ఏనుగు నవనారీకుంజరము, — అనగా నాయాకారము తొమ్మండుగురు స్త్రీలతో నేర్పరుపబడెను. దగ్గరనే మరియొకచిత్రమున నశ్వముపై స్త్రీ కలదు. గుఱ్ఱము అయిదుగురు స్త్రీలతో నేర్పరుపబడెను. పురుషుడు మన్మథుడు; స్త్రీ కుంతీదేవి. ఈ చిత్తరువులు చాల చక్కనివి.

తంజావూరును పాలించిన శరభోజుని కాలమున, అనగా పదు నెనిమిదవ శతాబ్దమున కొందరు రాజపుత్ర చిత్రరచనను రాజాస్థానమున ప్రవేశపెట్టిరి. క్రీ. శ. ౧౮౩౩-౫౫ సంవత్సరములందు బాలించిన శివాజీవలన వీరాదరింపబడి దంతము మీాదను, కర్రమీాదను చక్కని చిత్రములను వ్రాసిరి. ఉత్తరు హిందూదేశమున 'జారా' యని పిలువబడు రకమున నీటి రంగులతో చిత్రించి బంగారుపొడితోను, మణులతోను చిత్రముల నలంకరించుచుండిరి. నూనె రంగులతో వీరు వ్రాసిన రూపచిత్రములు కలవు. ఇవి యిప్పటికిని తంజావూరు, పుదుకోట లందు గానవచ్చును. శివాజి మరణించిన పిమ్మట వీరు చెదరిపోయి చిన్న చిన్న చిత్రములను వ్రాయుచు బజారులం దమ్ముచుండిరి. వీటియందు కళాచిహ్నము లరుదైనను పూజకొరకు విక్రయమగుచున్నవి. కొన్ని చిత్రకారుల కుటుంబములు కంసాలివృత్తి నవలంబించిరి.

మైసూరునందును హిందూచిత్రలేఖన మొక శతాబ్దమువరకు నేదోవిధమున నభ్యసింపబడి కృష్ణరాజ ఒడయరు పాలనమున నభివృద్ధి జెందెను. తన కొలువున ననేక చిత్రకారులను చేరదీసి, పోటిపరీక్షల నేర్పరచి,

చక్కని చిత్రములను వ్రాయించుచుండెను. దంతముమీద నీతడు చిత్రింపించిన రూపచిత్రములు మైసూరుకోట యందిప్పటికిని గలవు. ౧౮౬౮ సం॥ మున నీరాజు మరణించినపిమ్మట నీ చిత్రకారులందరు పోషణలేక తమవృత్తిని మానుకొనిరి.

౧౭౪౭-౭౮ సం॥ ములలో సింహళమును బాలించిన కీర్తి శ్రీరాయసింహుడు అప్పటికచ్చటగల యీకళను ప్రోత్సాహపరచెను. దీనికి ఫలముగ 'సిల్వతెన్న' మొదలగు చిత్రకారులు 'రిదీ విహారము'నను, 'దెగాలు దొరువ' యందును జాతక చిత్తరువులను వ్రాసిరి. ఇది సుప్రసిద్ధ చిత్తరువులు కాకపోయినను అలంకారార్థముపనికివచ్చును.

మరికొన్ని చిత్తరువులు కలవుకాని వాటినిచ్చట పేర్కొనుట యనవసరము.

# పంద్రెండవ అధ్యాయము

## ఇప్పటికాలము

ఆంగ్ల పరిపాలమునందు హిందూదేశమున పెద్ద మార్పులు కలుగుచున్నవి. ఉద్యోగముల గోరువారును, పాలకుల స్నేహము నాసించువారును ఆంగ్లాచారములను చాలవరకు నవలంబించిరి. ఆంగ్లవిద్యాభ్యాసముతో నాంగ్లేయుల సాహిత్యము ప్రతివారికిని చనువయ్యెను. అజ్ఞానమువ నుండువారి కాంగ్లభాషాజ్ఞానమువలన ప్రపంచమంతయు గోచరమగునటులయ్యెను.నూతనభావములు, నూతనరుచులు అంకురించెను. దేశభాషలు దేశీయనాగరికత వెనుకబడెను. పాలకులచే ప్రవేశపెట్టబడిన జ్ఞానమే సారమైనదని హైందవవిద్యాధికులు తలంపసాగిరి. ఈనూతన పరిస్థితులందు ఆంగ్లచిత్రకళా విధానములు నాదరింపబడుట యొకవింతకాదు. దీనికి సుప్రసిద్ధ చిత్రకారుడగు రాజారవివర్మ తోడ్పడెను.

## పండ్రెండవ అధ్యాయము

ఈతడు తిరువాన్కూరు రాజకుటుంబమునకు జెందినవాడు. చిన్నప్పటినుండి చిత్రరచనయం దభిరుచి యుండుటవలన మధురనివాసియగు అలగిరినాయనివద్దను దక్షిణ హిందూదేశమునకు వచ్చిన 'థియొడోరు జెన్సను' మొదలగు చిత్రకారులవద్దను తైలవర్ణలేపనమును నేర్చుకొనెను. ఇట్లు నాటబడిన ఐరోపావిధానములు మహావృక్షమై చక్కగ ఫలించినవి. అప్పటికి రాజపుత్ర, మొగలు చిత్రరచనలు క్షీణించి యుండుటచే నీతనినూతనమార్గము ప్రజల నాకర్షించెను. పురాణ కథలు స్ఫుటముగ బ్రజల కీతని చిత్రములందు గానవచ్చెను. తిరువాన్కూరు, బరోడామహారాజులచే ప్రోత్సాహితుడై యనేకచిత్రములను వ్రాసి యితడు అచ్చువేయించెను. రసికులగృహముల నలంకరించుట కివి చక్కనివర్ణములతో, సుందర విగ్రహములతో, బాగుగ నుపయోగపడెను. తమదేశపు సాంప్రదాయముల ననుసరించివ్రాసెను కాన నైరోపీయు లితనిని బొగడ మొదలిడిరి. అప్పటికి పాలకులదేశపు పండితులు చెప్పెడిదంతయు హైందవుల కింపుగ నుండెను. కాన, తమ కిదివరకుగలిగిన యభిప్రాయము ధృఢపడెను.

రవివర్మయంతటి చిత్రకారు డికనుండబోడని నమ్మకముచే నీతని కీర్తి త్వరలో దేశమంతయు వ్యాపించెను.

రవివర్మయొక్క చిత్రములందు హిందూచిత్రరచనా సాంప్రదాయముల చిహ్నము లేమియు కానరావు. ఇప్పుడు మన కనుదినమును కానవచ్చు వ్యక్తులఛాయాచిత్రమాత్రములుగ నీతనిచిత్రము లుండును. సుప్రసిద్ధమగు సరస్వతి చిత్తరువును జూడుడు. కిరీటమును, రెండు చేతులను దీసివైచిన సుందరాంగియొకతె యుద్యానవనమున వీణను మీటుచు నానందించుచున్నటులు గానవచ్చును. వీరు దేవతలని చూపుటకు కిరీటాది అలంకారములును, గరుడుడు, సర్పమాలలు, నాలుగుమొగములును మొదలగు నవిమాత్ర మాధారములు. పురాణకథలు మనకు బాగుగ దెలియునుకాన చిత్తరువును జూచినవెంటనే పోల్చ గలుగుచున్నాము. లేనియెడల ఆచీరలు, నగలు మొదలైనయలంకారములను జూచి యెవరేవ్యక్తియో, యేనవలల చిత్తరువులోయని భ్రమపడవలసివచ్చును. భారత వ్యక్తిత్వములేని యిట్టి చిత్రములను భారతసాహిత్యముకలయే యైరోపాచిత్రకారుడైనను వ్రాయజాలును.

## పండ్రెండవ అధ్యాయము

లక్ష్మి, సరస్వతి, బ్రహ్మ, మన్మథుడు ఇత్యాది పురాణవ్యక్తులు "భారతమాత" వలె ధనము, విద్య మొదలగువాటి భావరూపములని కొందరి నమ్మకము. ఇట్టియర్థమును స్వీకరించి చూచినను రవివర్మచిత్రములు విమర్శన కాగజాలవు.

చరిత్రనుగూడ రవివర్మ పాటింపలేదు. దమయంతి చిత్తరువులందు గల భవనము లిప్పటి పాశ్చాత్య నిర్మాణములవలె గానవచ్చును. చీరకట్టునందును, ఆభరణములందును సనాతన వాతావరణము, ఆచారములు మచ్చునకైనను లేవు.

హైందవ సాహిత్యమునం దుత్ప్రేక్షహెచ్చు. కవులయాలోచన, భావములు పెక్కురీతుల వింతమార్గముల ద్రొక్కెను. ఐరోపా కళలందు సాధారణముగ నుండుటయే సొగసు. హైందవలలితకళ లందలంకారచిత్రణము, సొగసు. దీని ననుసరించి రవివర్మచిత్రములను విమర్శించిన నీతడు పాశ్చాత్యకళాభ్యాసకుడని చెప్పక తప్పదు.

చిత్రములందు విగ్రహములకు పొందిక కూర్పుట యం దీతనిప్రజ్ఞవిశేషము. రెండుమూడు చిత్రములందు తప్పతక్కినవాటియందు వ్యక్తులుకొందఱేయైనను చిత్తరువులభావమును వ్యక్తపరచుట కివియే చాలుననునటులేర్పరుపబడెను. కృష్ణరాయబారము మొదలయిన చిత్రములందు వ్యక్తు లెక్కువయైనను అతిమనోహరముగ నున్నవి. దీనికి తోడు చూపరుల నాకర్షించు సౌందర్యము, లావణ్యము, భావము, వస్తుపరిచయము వీటియందు మూర్తీభవించియున్నవి.ఇట్టి చిత్రములందు భారతీయవ్యక్తిత్వము లేకపోవుటయు విచారకరము.

చెట్లు, ఉద్యానవనములు, సరస్సులు, పచ్చికబయళ్లు మొదలగు చిత్రాంగములను వ్రాయుటయం దీతడు భారతచిత్రకారులలో నగ్రగణ్యుడు. మానవుడులేని ప్రకృతి నీతడు ప్రత్యేకముగ వ్రాయకపోయినను, వీటిని వ్రాయుటయం దీతనికి తగిన యవకాశములు లేక పోయినను ప్రతి చిత్రమున నీతని గొప్పతనము తప్పక కానవచ్చును.

రవివర్మ రూపచిత్రములను చాల సొగసుగ వ్రాయగలిగెను. ఇవి దేశమం దచ్చటచ్చట గానవచ్చును కాని యచ్చుకాలేదు.



శ్రీ కృష్ణ రాయబారము

చిత్రకారుడు : శ్రీ రాజా రవివర్మగారు.

౨౦౦౬

## పండ్రెండవ అధ్యాయము

రవివర్మ శిష్యవర్గములో నొకడగు ధురంధరు పాశ్చాత్య విధానములందు చక్కని చిత్రములను వ్రాయుచున్నాడు. వీరును, తక్కిన బొంబాయి చిత్రకారులును వ్రాసిన చిత్రములందు రాజపుత్రచిత్రసాంప్రదాయము లుండుటచే రానురాను రవివర్మ స్థాపించిన సంస్థ దేశీయముగ మారవచ్చునను ఆశకలదు.

మధుర నివాసియగు రామస్వామినాయడును రూపచిత్రములను వ్రాయుటయందు చాల నిపుణుడు. ఈతడిందు రవివర్మను మించెనని కొందరియభిప్రాయము.

ఫైజీరహమానుగారు పాశ్చాత్యహైందవ విధానములను చక్కగ మేళవించి రూపచిత్రములను వ్రాయుచున్నారు. పాశ్చాత్యస్నాయుపుష్టిని, హైందవాలంకారములను కలిపి వ్రాయుట వీరి సొమ్ము.

బంగాళముననురూపచిత్రములను వ్రాయువారు చాలమంది కలరుకానియీ కళాభాగమునందు ప్రసిద్ధికెందినవా రల్పము.

హైందవ సంస్థానాధిపతులలో చిత్రకళాపరిచయ ముకలవారు 'ఆంధ్' మహారాజుగారొక్కరే. వీరు రాజపుత్ర చిత్రములవంటివి వ్రాయుట యానందింపదగినది.

వేషభాషలందే కాక ఆత్మానుభవమును వెల్లడి చేసి, యాత్మను పరిపక్వము జేయజాలి, జాతీయతను నిలువబెట్ట జాలిన లలితకళలందును పాశ్చాత్యభావము లగ్రస్థానమును వహించినను చూచుచు నిద్రావస్థయందుండుట యాత్మహత్యను గోరుటకు సమానము. ఈ ప్రమాదమును కొందరు గ్రహించుటచే తక్కిన జాతీయోద్యమములతోపాటు హైందవచిత్రకళాప్రపంచమునగూడ సంచలనము కలిగెను.

ప్రజాసామాన్యము భారత చిత్రకళయందాకర్షణశక్తి లేదని భావించుటవలన బూర్వకాలపు చిత్తరువు లామోదింపబడుటలేదు. పాలకులు స్థాపించిన చిత్రకళాశాలలందు చిత్రకళ నభ్యసించినవారే గొప్పవారుగ పరిగణింపబడుచున్నారు. ఉదరపోషణకై పాఠశాలలందు ఉపాధ్యాయులుగ నున్నవారందరుపాశ్చాత్యవిధానములనేపొగడుచున్నారు.

వివాహములందు గోడలపై కొందరు చిత్రములను వ్రాయించుచున్నారు. బజారునందును, తీర్థయాత్రలందును చిత్రములమ్ముడుపోవుచున్నవి. ఇవి బాగుగ లేకపోయినను ఆంగ్లవిద్యాగంధము లేనివారివియే మంచివని భావించుచున్నారు. చిత్రము లెట్టివైనను, దేవతావిగ్రహ మందున్న కొందరికిచాలును. ఇట్టి పరిస్థితులందు నూతనసంస్థలు త్వరలో వర్ధిల్లుట కష్టము.

కాని గ్రుడ్డిలో మెల్ల యనునటులు అజంతచిత్రవిధానములు, రాజపుత్రకళ యింకను కొన్నిప్రాంతములం దాదరింపబడుట యొక శుభసూచకము. ఇది చాలవరకు వంగదేశపు చిత్రకారులకు తోడ్పడుచున్నది.

భారత చిత్రకళయందు జొరబడిన విదేశరుచులను బారదోలి నిజమగు హైందవ వ్యక్తిత్వమును మరల సింహాసనమున స్థాపింపజూచుచున్న యువకులకు అవనీంద్రనాథఠాకూరు నాయకుడు. రాజపుత్ర చిత్రరచనయందు పర్షియావిధానములుకలవు. కాన సుప్రసిద్ధ అజంత, సీగిరియచిత్రములు భారతకళ నుద్ధరించుటకు మూలా



శ్రీ అవనీంద్రనాథఠాకురు

ధారములుగ నుండవలెనని వీరి కోరిక. కాని తరువాతి దేశానుభవమును కళాభిమాని మరువరాదు. రాజపుత్రులచే నామోదింపబడిన విధానము లందనేకములు వాంఛనీయ చిహ్నములు కలవు. జపాను, ఐరోపా విజ్ఞానములచే పోషింపబడిన చిత్రరచనయందును క్రొత్తరుచులు కలవు. ఇంత విశాలభావములతో ప్రారంభమైన చిత్రకళ జాతీయతను నిలుపుకోగలదాయని సంశయింపవచ్చును. ఏదేశపు విజ్ఞానమునైనను తిరస్కరింపక భారత చిత్రముల కట్టుబాట్లను మరువక వ్రాయుటయే కళకు క్షేమకరము.

రవివర్మవలె ఠాకురును చిత్రములను నూనెరంగులతో మొదట నభ్యసించెను. హైందవ సాంప్రదాయముల కిది తగదని కొంతకాలమునకు గ్రహించి నీటిరంగులతో చిన్నచిత్రములను వ్రాయుట ప్రారంభించెను. అప్పటికి కలకత్తా చిత్రకళాశాలకు ప్రధానోపాధ్యాయుడుగనుండిన హేవెల్-సుప్రసిద్ధచిత్రకళావిమర్శకుడు-ఈతని మార్గముల నామోదించి దొరతనమువారితో వాదించి యీ నూతనరుచులను తనపాఠశాలలో ప్రవేశపెట్టగల్గెను.

అవనీంద్రనాథ ఠాకురుగారివద్ద గగనేంద్రనాథ ఠాకురు, నందలాలుబోసు, ఈశ్వరప్రసాదు, అసిత కుమారహాల్దారు, ప్రమోదకుమార చటోపాధ్యాయ, హాకీమ్ మహమ్మదుఖాను, అబ్దుర్ రహమాను చుగతాయి మొదలగువారు శిష్యులుగజేరి సనాతనకాలమునుండి వివిధరూపములదాల్చి, వింతరుచులను జూపిన భారతచిత్ర రచన నుద్ధరించుటకు బూనుకొనిరి.

వీరు తమకు దోచినటులు, భారత రామాయణాది పురాణముల, కాళిదాసాది కవుల గ్రంథరాజముల, భగవద్గీతాదిమతగ్రంథముల, భారత చరిత్రను ఆధారముగగొని చిత్తరువులను వ్రాయుచున్నారు. వీటియందు కొన్ని మాత్రము మంచివగుటచే వీరిప్రయత్నము లింకను స్థిరపడనటులు గన్పట్టుచున్నది. జపాను విధానములను వీరధికముగ జొప్పించుచున్నారు. చిత్రములపై పేరులను వ్రాయుట యందును చైనాజపానులకు దాసులగుచున్నారు. ఇది యిటుండ కొన్ని చిత్రములు పాశ్చాత్యవిధానములందు రవివర్మచిత్రములను మించియున్నవి. కొందరు వెనుకముందు

జూడక బాగుగనున్నను, లేకపోయినను అజంత చిత్తరువుల ననుకరించుచున్నారు. మరికొందరు ప్రకృతిని తిరస్కరించుటకు ధృడసంకల్పులైనటులు గన్పట్టుచున్నది. కాని జాతీయసంస్థయెడల వీరికి ప్రేమోత్సాహములు కలుగుటచే నూతన చిత్రకారుల నాకర్షించి యీ సమితి వర్ధిల్లునను ఆశకలదు. భారత సాహిత్య శిల్పము లీసంస్థకు ముఖ్యమైన యాధారములు.

ప్రమోదకుమారచటోపాధ్యాయుని రప్పించి జాతీయ చిత్రరచన నాంధ్రదేశముననాటుటకు కొన్ని ప్రయత్నములు జరిగెను. దీనికి ఫలముగ బందరు జాతీయ కళాశాలయందు కొందరు చిత్రకారులు ప్రవీణులైరి. వీరినిగూర్చి వ్రాయుట కింకను నాధారములు చాలవు.

వంగదేశమున జరిగిన ప్రయత్నములవంటివి తొలుత ఆంధ్రదేశమున దామెర్ల రామారావు చేసెను. ఠాకురువలె వీరును తొలుత ఐరోపామార్గములనే త్రొక్కిరి. కాని త్వరలో హైందవ కళాధిక్యమును గ్రహించిరి. అజంత చిత్తరువులందలి లోపములను దీర్చి, ఆంధ్రకళాభి

రుచులకు సరిపోవునటులు వ్రాసి యొక యాంధ్రకళాసం స్థను నెలకొల్పుట యీతని యభిలాష. ఈచిత్రకారుని యకాలమరణమువలన నీమహోద్దేశములు నెరవేరలేదు. ఈతఁడు ప్రారంభించిన పని నితరులు పూని నిర్వహింతు రగుఁగాక!

ఈకాలమున భారతీయులు చిత్రరచన నాదరించుట తక్కువ. ఏది మంచిచిత్రమో, యేది చెడ్డదో ప్రజాసామాన్యము గ్రహింపజాలకున్నది. కాని కొలఁది కాలములో నిట్టి యజ్ఞానము తొలఁగఁగలదు. హైందవ చిత్రరచనకు మున్ముందు మంచి దినములు రాగలవు. దేశీయ సంస్థలపై నభిమానము పెరుగుచున్నది. భారత దేశపు సనాతననాగరికతయెడల నభిమాన మధికమగు చున్నది. సభలు జరుగుచున్నవి. శ్రీకళామయుని కృప వలన భారత చిత్రకళ లోకకళ్యాణమునకు దోడ్పడ గలదు.

సంపూర్ణము

---

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | TRB01A158 | Date | 16/02/22 |
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | (I), IV, ౧౦, 3, ౫౦(a), 160, ౧౩౬(b), ౧౫౮(b), ౧౬౧(a), ౧౬౦(c), ౨౦౦(a), ౨౦౬, | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Swathi | Cutting By | Swathi |
| Scanned By | T. Rajendra | Pages | 249 |